


# వేదాలలో దేశభక్తి

(అథర్వవేదీయ పృథ్వీసూక్త సరళార్థ వివరణలు)

పృథ్వీసూక్త సారాంశ సహితము

మంత్రకర్త

'ఓం' నామక సర్వవ్యాపక సర్వేశ్వరుడు









సరళార్థ వివరణ కర్త

సుమ్నార్థి

(డా॥ కోడూరి సుబ్బారావు)




# వేదాలలో దేశభక్తి

(అథర్వవేదీయ పృథ్వీసూక్త అర్థ వివరణలు)

## పృథ్వీసూక్త సారాంశ సహితము

మంత్రకర్త

'ఓం' నామక సర్వవ్యాపక సర్వేశ్వరుడు


సరళార్థ వివరణ కర్త

## సుమ్నార్థి

(డా॥ కోడూరి సుబ్బారావు)



గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ

# వేదాలలో దేశభక్తి


గాయత్రీ గ్రంథమాల: 65

ప్రతులు : 1000

సర్వస్వామ్యములు : గ్రంథకర్తవి

సృష్టి సంవత్సరం : 1,97,29,49,121

విక్రమాబ్దము : 2076

కలియుగ సంవత్సరం: 5121

శ్రీ వికారి నామ సం॥ర మార్గశీర్ష పౌర్ణమి 12-12-2019

మూల్యము : 60/- (తపాలా ఖర్చులు అదనము)


ప్రతులకు :


1. డా॥ కోడూరి సుబ్బారావు, వైదికవానప్రస్థాశ్రమం,
హనుమాపురం(B.O.); (Via.)భువనగిరి-508116. సెల్: 99089 94084.

2. గాయత్రీ ఆశ్రమ ట్రస్టు, ఆర్యసమాజము,
12-10-586/6, మేడిబావి, సీతాఫలమండి,
సికింద్రాబాద్-500 061. సెల్: 98480 11073.

3. డా॥ మట్టి కృష్ణారెడ్డి, వేదధర్మ ప్రచార ట్రస్టు(రి.).,
2-27,ఆర్య సమాజ మందిరం, బాదం కాంప్లెక్సు,చైత్యనపురి క్రాస్ రోడ్,
దిల్‌సుఖ్‌నగర్. హైదరాబాద్-60. సెల్: 94412 00322.

4. శ్రీ మాశెట్టి శ్రీనివాస్ ఆర్య, షాప్ నెం. 5, మాశెట్టి బిల్డింగ్,
3-3-736-740, కంచరిబజార్, సికింద్రాబాద్, ఫోన్: 040-6632 0300.

5. శ్రీ బాశెట్టి సత్తయ్య, జె-38, రాంగోపాల్‌పేట, సికింద్రాబాద్-500003.
సెల్ : 99485 39795.

6. ఆర్యసమాజము, కూచిపూడి, తెనాలి-522313. సెల్:08644-252789.

5. ఆర్యసమాజ మందిరం, మెయిన్‌రోడ్, రైల్వే ఫ్లైఓవర్ దగ్గర,
సీతాఫలమండి-500061, 040-27071816; 9133134156; 9246174018

ఓ౩మ్

## ప్రార్థన

# మాతృభూమికి వందనము

ఓం భద్రమిచ్ఛన్తి ఋషయః స్వర్విదః
తపో దీక్ష ముపనిషేదు రగ్రే ।
తత్ రాష్ట్రం బలమొజశ్చ జాతం
తదస్మై దేవా ఉపసం నమన్తు ॥

– అథర్వవేదం. 19. 41. 1

పరమేశ్వర ఆనందమును పొందిన ఋషులు లోకకల్యాణమును గోరుచు ముందుగా తపోదీక్షలను గ్రహించిరి. ఆ తపో దీక్షలతో రాష్ట్రాన్ని (దేశాన్ని) దాని రాజ్యాంగాన్ని (Constitution)ని రూపొందించిరి. వాటి ననుసరించియే రాష్ట్రీయ బల ఓజస్సులు నిర్మింపబడినవి. అందుచే ఆ రాష్ట్ర రాజ్యాంగాల ఎదుట ఋషులు, విద్వాంసులు, విజ్ఞానవేత్తలు, వీరులు, శూరులు నాయకులు, ప్రజలు అందరు నతమస్తకుగుదురుగాక, వాటిని సత్కార పూర్వకంగా స్వీకరింతురుగాక, సేవింతురుగాక ! తను మన ధనముల నర్పింతురుగాక.

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

## సుప్రసిద్ధ డా॥ కోడూరి సుబ్బారావు గారి రచనలు

| | | |
|---|---|---|
| 1. | గాయత్రీ మహిమ | 30-00 |
| 2. | గాయత్రీ విజ్ఞానం | 100-00 |
| 3. | మన ఇతిహాసం | 70-00 |
| 4. | మన వేదశాస్త్రాల పరిచయం | 60-00 |
| 5. | అగ్నిహోత్రం 100 శాతం వైజ్ఞానికం | 60-00 |
| 6. | అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ | 30-00 |
| 7. | అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము | 30-00 |
| 8. | గోమాత | 40-00 |
| 9. | వేదాలలో సూర్యకిరణ చికిత్స | 80-00 |
| 10. | వేదాలలోజలచికిత్సావిజ్ఞానం | 50-00 |
| 11. | పెండ్లినాటి ప్రమాణాలు | 40-00 |
| 12. | గర్భాధాన విజ్ఞానం | 50-00 |
| 13. | దౌహృదిని | 40-00 |
| 14. | మరణానంతరం జీవుని ప్రయాణం | 40-00 |
| 15. | మానవ ధర్మము | 40-00 |
| 16. | ఈశావాస్యమిదం సర్వమ్ | 35-00 |
| 17. | దేవుడు-జీవుడు-ప్రకృతి | 30-00 |
| 18. | వేదాలలో అశ్వనీ దేవతలు | 20-00 |
| 19. | సంధ్యావందనం-వైజ్ఞానిక సమాలోచన | 20-00 |
| 20. | జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ | 60-00 |
| 21. | వేదాల వెలుగుచూపే ఆర్యసమాజము | 30-00 |
| 22. | వైదిక జన్మదిన వేడుక | 30-00 |
| 23. | పండుగల పరమార్థం | 40-00 |
| 24. | వైదిక గృహప్రవేశ విధి | 30-00 |
| 25. | వేదాలలో పర్యేష్టి విజ్ఞానం | 25-00 |
| 26. | వైదిక క్రాంతి పథం | 30-00 |
| 27. | పురుషసూక్తము | 20-00 |
| 28. | వైదిక శాంతి పాఠం (వైజ్ఞానిక వ్యాఖ్య) | 20-00 |
| 29. | సృష్టికథ | 20-00 |
| 30. | సరస్వతీ సూక్తము | 10-00 |
| 31. | స్వతంత్ర సముపార్జనలో మహర్షి దయానందుడు | 10-00 |
| 32. | వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమము | 10-00 |
| 33. | గంగాధర శివుడు | 10-00 |
| 34. | ప్రణవస్తోత్రము | 10-00 |
| 35. | లక్ష్మీశాంతి సూక్తాలు | 20-00 |
| 36. | వేదాలలో మనోవిజ్ఞానం | 20-00 |
| 37. | వేదోపదేశాలు (ముద్రణలో) | |
| 38. | వైదిక సుప్రభాతం (ముద్రణలో) | |
| 39. | శివరాత్రి రహస్యము (ముద్రణలో) | |
| 40. | గణపతి రహస్యము | 20-00 |
| 41. | వేదాలలో దేశభక్తి | 50-00 |

## ఇతర విద్వాంసుల రచనలు

| | | |
|---|---|---|
| 1. | మాతాపుత్రికల జ్ఞాన చర్చ | 60-00 |
| 2. | సత్యధర్మ విచారణ | 6-00 |
| 3. | స్వరాజ్య సంగ్రామములో ఆర్యసమాజము (ముద్రణలో) | |
| 4. | ధర్మవీర్ పం.లేఖారామ్ | 5-00 |
| 5. | వేదాలలో విజ్ఞానబీజాలు (ముద్రణలో) | |

ముద్రణలో ఉన్నవి దాతలు లభించినపుడు ముద్రింపబడును

శ్రీమాన్ గొడవర్తి కోటేశ్వరరావుఆర్య మొదటినుండి భగవంతుని పట్ల అచంచలమైన భక్తివిశ్వాసాలు కలిగి ఉండి పౌరాణిక పద్ధతిలో దేవాలయాలను దర్శిస్తూ మూర్తిపూజల యందు శ్రద్ధ కలిగియుండిరి. పూర్వజన్మసుకృతము మరియు దైవానుగ్రహముల వలన వీరికి తెనాలి ఆర్యసమాజముతో పరిచయము కలిగినది. పండిత గోపదేవశాస్త్రిగారి ప్రవచనముల ద్వారా వేదోక్త సర్వవ్యాపక పరమేశ్వర తత్త్వాన్ని తెలుసుకొని నిత్యాగ్నిహోత్రులై, ధ్యానసంధ్యలను విధిగా పాటిస్తూ వేదానుకూల గ్రంథాలను నిత్యం స్వాధ్యాయం చేస్తూ, బంధుమిత్రులను ప్రోత్సహిస్తూ, యజ్ఞయాగాది క్రతువులు చేయిస్తూ, షోడశ సంస్కారాలను శక్తికొలదిగా నిర్వహిస్తూ, ఆర్యసమాజము ద్వారా వేదప్రచారము గావించుచున్నారు. తెనాలి ఆర్యసమాజముపై కూడా వీరికి చాలా గౌరవము. ఎవరు వచ్చినా రాకున్నా పట్టించుకోక సమాజమునందు నిత్యము యజ్ఞము తప్పక నిర్వహిస్తారు. వీరు పలుమార్లు శిక్షణాశిబిరాలలో పాల్గొని జ్ఞానం పెంచుకొని శక్తికొలది పవిత్ర కార్యాలకు తమ ధనాన్ని దానంగా యిస్తున్నారు.

ఈ సందర్భంగా తెనాలి ఆర్యసమాజము గురించి కూడా ఒక మాట తెలుసుకోవాలి. పం.గోపదేవశాస్త్రి గారి జన్మస్థలమైన కూచిపూడికి సమీపంలో ఉండటం వలన గోపదేవశాస్త్రి గారి ప్రవచనాలు తెనాలి ఆర్యసమాజములో ఎక్కువగా జరుగుచుండేవి. పండిత వెంకయ్యార్య గారి జన్మస్థలం తెనాలి కనుక వారి మార్గదర్శకత్వంలో ఎందరో వేద ప్రచారకులు మరియు పురోహితులు యిక్కడ నిర్మాణమయ్యారు. వీరిలో శ్రీ గొడవర్తి కోటేశ్వరరావు ఆర్యగారు కూడా ఒకరై ఉన్నారు. వీరు ఈ పుస్తకముద్రణకు రూ. 12,000లు దానమొసంగినారు. ఈశ్వర కృపచే వీరికి సంపూర్ణ ఆయురారోగ్య ఐశ్వర్యాలు చేకూరాలని కోరుచున్నాము.

ఇట్లు

సుమ్నార్థి

(డా॥కోదూరి సుబ్బారావు)

ఓ౩మ్

# పుస్తక నేపథ్యం

నాలుగు వేదాలలోను దేశభక్తిని తెలిపే మంత్రాలు వందలకొలది ఉన్నాయి. వాటిలో 63 మంత్రాలుగల అథర్వవేదం 12వ కాండలోని మొదటి సూక్తం పృథివీ సూక్తమనే పేరుతో ప్రముఖంగా కనబడుతుంది. ఈ సూక్తంలోని మొదటి మంత్రం దేశ ఔన్నత్యానికి అవసరమైన 8 గుణాలను సూచిస్తుంది. దీనిని గురించిన వివరణ నా రచన "జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అనే గ్రంథంలో చాలా కాలం పూర్వమే తెలిపియుంటిని. ఆ 8 గుణాలే కాక మరెన్నో గుణాలు, సూచనలు ఈ సూక్తంలో ఉన్నాయి. వాటిని కూడా సంక్షిప్తంగా తెలుపాలనే సదుద్దేశ్యంతో నేను ప్రతీరోజూ పంపే Whatsapp మెసేజీలుగా పంపాలని సంకల్పించాను. గత ఫిబ్రవరి నెలలో ప్రారంభమైన సార్వత్రిక ఎన్నికల సందర్భంలో వీటిని పంపటం మొదలుపెట్టాను.

ప్రతీరోజు ఒకే విషయంపై మంత్రార్థాలు పంపటం కన్న ఒకరోజు వేదాలలో విజ్ఞాన విషయములు, మరునాడు వేదాలలోని దేశభక్తి విషయము వ్రాసి పంపటం ప్రారంభించాను. అందుచే ఈ పృథివీ సూక్తంలోని 63 మంత్రాలు పంపటానికి 63×2 = 126 రోజులు పట్టింది. 60వ మంత్ర వచ్చేటప్పటికే దేశభక్తితో, ధర్మభక్తితో కూడిన భారతీయ జనతా పార్టీ (BJP) భారీమెజారిటీతో కలిగించింది. అప్పటి హెూరా హోరీ ఎన్నికల ప్రచార

సమయంలో ఈ సూక్తంలోని దేశభక్తికి చెందిన అనేకానేక విషయాలు పాఠకుల వివేకాన్ని తట్టిలేపాయని భావిస్తున్నాను. దానికి పాఠకుల నుండి వచ్చిన స్పందనలే కారణం. చాలా మంది వీటిని పుస్తక రూపంలో ప్రచురిస్తే బాగుంటుందని సూచించారు. అప్పుడప్పుడు వీటిని చదువుచు ప్రేరణ పొందవచ్చునన్నారు. నాకు కూడా అట్లే అనిపించింది. జాతీయ పర్వాలైన స్వాతంత్ర్య, గణతంత్ర దినోత్సవాలలో ఈ మంత్రాలతో విశేష హోమం చెయ్యటానికి అనుకూలంగా ఉంటుందనిపించినది. దాని పరిణామంగా ఈ చిన్న పుస్తకం తయారయ్యింది.

సార్వదేశిక ఆర్య ప్రతినిధి సభవారి ప్రచురణ చతుర్వేదభాషా భాష్యాలలో అథర్వవేదం, పం॥ క్షేమకరణదాస్ త్రివేదిగారి భాష్యం, ఆ భాష్య ఆధారంగా ఈ సరళార్థం వ్రాయబడింది. దాని ఆధారంగానే మా గురుదేవులు చాలా కాలం క్రిందట పృథివీ సూక్తానికి అర్థతాత్పర్యాలు వ్రాసి ప్రచురించారు. కాని, అవి ఇప్పుడు లభించటం లేదు. అందు గురుదేవులు పృథివీ సూక్త సారాంశాన్ని ఉపోద్ఘాతంగా వ్రాశారు. అది చాలా ఉన్నతంగాను, ఆదర్శంగాను ఉంది. కనుక దానిని కూడా ఈ పుస్తకంలో చేర్చుచున్నాను.

సహృదయులు, వేదసాహిత్య ముద్రణకే తమ జీవితాన్ని అంకితం చేసిన బహు బిరుదులు పొందిన వాచస్పతి డా॥ మట్టి కృష్ణారెడ్డిగారి పూర్తి సహకారంతోనే ఈ చిన్న పుస్తకం ప్రచురించగలిగాను. వారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు. అభినందనలు. ఆశీస్సులు. సర్వవ్యాపక సర్వేశ్వరుడు వారికి, వారి కుటుంబానికి దీర్ఘ ఆయురారోగ్య ఐశ్వర్యాలను, శక్తి సామర్థ్యాలను ప్రసాదించునుగాక.

-సుమ్నార్థి

(డా. కోదూరి సుబ్బారావు)

ఓ౩మ్

# వేదాలలో దేశభక్తి

## (అథర్వవేదీయ పృథ్వీసూక్తం-సరళార్థ సహితం)

సర్వవ్యాపక సర్వసంరక్షక సచ్చిదానంద సర్వేశ్వరుడు తన అనంత జ్ఞానంతో, శక్తి సామర్థ్యాలతో ఈ అద్భుతాద్భుత సృష్టిని గావించి ఉత్తమ ప్రాణిగా మానవుడిని సృష్టించాడు. వికసించిన ఇంద్రియాలు, బుద్ధి కలిగిన మానవులకు వేదాల ద్వారా సృష్టివిజ్ఞానాన్నంతా బోధించాడు. సామాజిక ప్రాణులైన మానవులకు సామాజిక నియమాలను, రాజనైతిక నియమాలను కూడా బోధించాడు. ఆ వేదోపదేశాలను అనుసరిస్తే మానవులకు శారీరక సామాజిక ఉన్నతులతో బోటు ఆత్మికోన్నతి కూడా కలుగుతుంది. మానవ జీవన పరమ లక్ష్యమైన సర్వదుఃఖ నివృత్తిరూప మోక్షానందం లభిస్తుంది.

వైదిక ధర్మంలో దేశభక్తి రాష్ట్రీయభావన ఒక ప్రధాన అంశం.కేవలం రాష్ట్రభక్తియే గాక రాష్ట్రోన్నతికి-ఆర్య చక్రవర్తి రాజ్యప్రాప్తికి, తద్వారా మానవోన్నతికి కావలసిన మార్గదర్శక సూత్రాలు వేదాలలో విస్తృతంగా ఉన్నాయి. ముఖ్యంగా అథర్వవేదంలో 63 మంత్రాలుగల పృథివీ సూక్తం మానవమాత్రునిగా ఏ దేశవాసియైనా తన దేశం పట్ల ఎటువంటి భావనను కలిగి ఉండాలో వివరిస్తుంది. వేదం మానవుని దేశంతో మాతాపుత్ర సంబంధంతో బంధిస్తుంది. అట్టి ప్రేరణతో జాగృతుడైన మానవుడు-

"మాతా భూమిః పుత్రోఽహం పృథివ్యాః" -అథర్వవేదం. 12. 1. 12.

**"జన్మభూమి నాకు తల్లి, నేను ఆ భూమికి పుత్రుడ"** నని ఘోషిస్తాడు. అవసరమైతే అట్టి భూమాత రక్షణకు **"తుభ్యం బలిహృతః స్యామ"**-నీ రక్షణకై ఆత్మ బలి నర్పించుటకు సిద్ధముగా నున్నానని ప్రతిజ్ఞ చేస్తాడు. కేవలం ఆపదలో ఆదుకోవటమే పుత్రుని కర్తవ్యం కాదు. తన తల్లి కీర్తిని నలుదిశల వ్యాపింప చెయ్యాలి. ఆ దేశమాత కీర్తికి కళంకాన్ని తెచ్చే ఏ చెడు కార్యం ఎప్పుడూ ఎక్కడా చేయకుండా ఉండాలి (అ.12.1.56). ఇట్టి ఉపదేశాలు ఈ పృథివీ సూక్తంలో అనేకం ఉన్నాయి.

మన ఋషులు వ్రాసిన ఒక ప్రాచీన శ్లోకంలో ఏకాదశీ వ్రతాన్ని గురించి చెబుతూ కేవలం భౌతిక ఉపవాసాన్నే కాకుండా 11 వ్రతాలను (వరించి స్వీకరించే మంచిపనులను) చేయు దీక్ష తీసుకోవాలన్నారు. ఆ 11 వ్రతాలలో **"స్వదేశీ స్పర్శభావనా"** అనేది ఒకటి. అంటే- స్వదేశం పట్ల మాతృ స్పర్శనను కలిగి ఉండటం. మన శరీరాలు మన తల్లి రక్తంతో నిర్మించబడ్డాయనే విషయం అందరికి తెలిసినదే. అట్లే, ఆ తదుపరి మనదేశ ఆహారం పానీయాలతో మనదేహాలు పెరిగి పెద్దవై జీవిస్తున్నాయి. అమ్మరక్తంలో ఉన్న కాల్షియం, పొటాషియం, మెగ్నీషియం మొదలైన మూలకాలు, విటమిన్లు మన శరీరంలోకి వచ్చినట్లే ఇప్పుడు భూమాతలోని ఈ లవణాలు ఆహారం ద్వారా మన శరీరంలోనికి చేరుతున్నాయి. కనుక ఆమె మనకు తల్లి అనటంలో సందేహమేముంది? కనుక మనం మన తల్లిని ఎవరైనా దూషించినా, నిందించినా వెంటనే స్పదించి తగిన సమాధానం చెబుతాము కదా! అట్లే మన దేశమాతను ఎవరైనా దూషించినా, ఆక్రమించ యత్నించినా మనం వెంటనే స్పందించి సమాధానం చెప్పాలి. దేశాన్ని ఎలా తీర్చిదిద్దాలి, ఎలా బలపరచాలి అనే మార్గదర్శక సూత్రాలు కూడా ఈ సూక్తంలో ఉన్నాయి. శత్రువులు దాడిచేస్తే వారికి తగిన గుణపాఠం చెప్పాలంటుంది ఈ సూక్తం. ఇట్టి ఆదర్శ భావాలు ఈ పృథివీ సూక్తంలో చాలా ఉన్నాయి. క్రమంగా తెలుసుకునే ప్రయత్నం చేద్దాము రండి....

# వేదాలలో పృథివీ విజ్ఞానం

ఉపసర్ప మాతరం భూమిమేతా-

మురువ్యచసం పృథివీం సుశేవామ్ ।

ఊర్ణమ్రదా యువతిర్దక్షిణావత ఏషా

త్వా పాతు నిరృతేరుపస్థాత్ ॥ ఋగ్వేదం. 10.18.10

ఓ మానవులారా! ఓ జీవాత్మలారా! ఈ విస్తీర్ణమగు భూమాత మీకు మొదటి తల్లి. ఆదిమానవులు ముందుగా భూమాత గర్భంలోగానే చేరారు. ఆమె సుయోగ్యురాలైన యువతివలె మీకు యువావస్థ వచ్చు వరకు తన గర్భంలోనే ఉంచుకొని పెంచి పెద్ద చేసింది. తదుపరియే ఆదిమానవులు భూమిమీద తిరుగాడారు. ఇప్పుడున్న మానవులకును ఆహారాదుల నిచ్చి పెంచి పోషిస్తున్నది. కనుక, మీరు భూమాత సేవలను గుర్తించి చక్కగా ఆ తల్లిని సేవించండి. ఆ భూమాతకు ఎట్టి కష్టం కలుగుకుండా కాపాడుకోండి. ఉన్నతికై కృషిచేయండి. కీర్తించండి.

ఉచ్ఛ్వంచస్వ పృథివీ మా ని బాధథాః

సూపాయనాస్మై భవ సూపవంచనా ।

మాతా పుత్రం యథా సిచాఽభ్యేనం భూమ ఊర్ణుహి॥

ఋగ్వేదం. 10.18.11

ఓ మానవులారా! ఈ భూమి పొంగినట్లుండి ప్రాణులన్నిటిని తన కడుపులో పెట్టుకున్నట్లున్నది. ఉత్తమ పరిచారికవలె ప్రాణులకు వలయునవన్నీ సమకూర్చి పెట్టుచున్నది. అది తన పరిధిలో స్థిరంగా ఉంటూ తనపై వసించు స్థావర జంగమ ప్రాణులన్నింటినీ తన ఆకర్షణ శక్తితో తల్లివలె పొదిలి పట్టుకుని రంగులరాట్నంవలె తిరుగుచున్నది. తల్లి తన కొంగును కప్పి బిడ్డకు పాలను త్రావించునట్లు మనకు అది గృహసామగ్రి నిచ్చి ఆచ్ఛాదనంగా కూడా ఉంది.

ఉచ్ఛ్వఞ్చమానా పృథివీ సు తిష్ఠతు

సహస్రం మిత ఉప హి శ్రయన్తామ్ ।

తే గృహాసో ఘృతశ్చుతో భవన్తు
విశ్వాహాస్మై శరణాః సన్త్వత్ర ॥ ఋగ్వేదం. 10.18.12

ఓ మానవులారా! మీరు వసించు ఈ భూమాత ఉబికినట్లు ఉత్తిష్ఠతను కలిగివుంది. పెద్ద బంతివలె చక్కని రూపంతో స్థిరపడింది. సహస్రాది (అనేకానేక) ఖనిజ లవణాదులతో నిండి ఉంది. అసంఖ్యాక పార్థివ పరమాణువులే భూమాతగా రూపుదిద్దుకున్నాయి. అది ఘృతమువలె మృధువుగా నుండి ప్రాణులన్నిటికి ఆహార వస్త్ర గృహ ఆభరణాదును ఇస్తున్నది. ఈ భూమి ప్రాణులకు గృహమువలె ఉంది. కనుక విచక్షణారహితంగా వృక్షజాతులను నరకవద్దు. అట్లే వివిధ ప్రాణిజాతులను నశింపజేయవద్దు. పర్యావరణ సమతుల్యతకు ఇవన్నీ అవసరమే. మనకే కాక మన ముందు తరాలకును ఆ సమతుల్యత అవసమే. తస్మాత్ జాగ్రత్త.

ఉత్తే స్తభ్నామి పృథివీం త్వత్ పరీమం
లోగం నిదధన్మో అహం రిషమ్ ।
ఏతాం స్థూణాం పితరో ధారయన్తు
తేఽత్రా యమః సాదనాతే మినోతు ॥ ఋగ్వేదం. 10.18.13

ఓ మానవులారా ! మీ కొరకు ఈ పృథివిని ఆకాశంలో పడిపోకుండా దృఢముగా చేయుచున్నాను. సూర్యుని ఆకర్షణతో నిలిపియుంచుచున్నాను. అన్నిటిని ధరించు నియమించి నడిపించు (యమః) యముడను జగన్నియంతను కూడా నేనే కనుక మీరు నిశ్చితంగా ఈ భూమిపై నివసించండి.

ప్రతీచీనే మామహనీష్వాః పర్ణమివా దధుః ।
ప్రతీచీం జగ్రభా వాచమశ్వం రశనయా యథా॥ ఋగ్వేదం. 10.18.14

ఓ వేదవిద్వాంసులారా! ఏ విధంగా బాణాలు పుచ్ఛాలు బంధించబడి ఉంటాయో అట్లే నేను ప్రాకృతిక జ్ఞానాన్నంతా వేదాలలో సూత్రప్రాయంగా బంధించి మీకిచ్చాను. మీరు వాటిని లోతుగా అధ్యయనం చేసి ఆ సూచనల మేరకు ఈ పృథివీ మాతను కాపాడండి. శుభమస్తు. మీకు శుభమగునుగాక !

# వేదాలలో దేశభక్తి

## పృథ్వీసూక్తం-అథర్వవేదం-12వ కాండం

## మొదటి సూక్తం

ఓం సత్యం బృహదృతముగ్రం దీక్షా
తపో బ్రహ్మ యజ్ఞః పృథివీం ధారయన్తి ।
సా నో భూతస్య భవ్యస్య పత్న్యురుంలోకం
పృథివీ నః కృణోతు ॥1॥ అథర్వవేదము. 12. 1. 1

"గొప్పదైన సత్యం, ఉగ్రస్వభావంగల ప్రాకృతిక నియమవిజ్ఞానం, ధర్మకార్యాల నాచరించే దీక్షా, శారీరక వాచిక మానసిక తపస్సులు, బ్రహ్మజ్ఞానం (వేద జ్ఞానం, ఆత్మ జ్ఞానం), దైనిక అగ్నిహోత్రం మొదలు అశ్వమేధ యాగ పర్యంతం ఉండే యజ్ఞ విజ్ఞానం- ఈ ఆరు సుగుణాలతోనే మాతృభూమిని అలంకరించవలసి ఉంది. అర్చించవలసి ఉంది. అట్టి సుగుణ భూషితమైన పృథివి- మాతృదేశం వర్తమానమందే గాక భూతకాలంలోను ప్రజలను చక్కగా పాలించినది. భవిష్యత్తులోనూ చక్కగా పాలించగలుగుతుంది. అట్టి మాతృభూమి మాకు (మా దేశపౌరులకు) ప్రపంచంలో ఉన్నత స్థానాన్ని కలిగించును గాక"! అని సంకల్పించమంటుంది అథర్వవేదంలోని ఈ పృథ్వీ సూక్తం.

ఈ మంత్ర వివరణ కొరకు నా రచన "**జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ**" చదువగోరుచున్నాను.

ఓం అసంబాధం మధ్యతో మానవానాం
యస్యా ఉద్వతః ప్రవతః సమమం బహు ।
నానా వీర్యా ఓషధీర్యా బిభర్తి
పృథివీ నః ప్రథతాం రాధ్యతాం నః ॥2॥ అథర్వవేదము. 12.1.2

ఏ దేశ మానవుల మధ్యలో కలతలు, హెచ్చుతగ్గులు ఉండవో; మిత్రత, సఖ్యత, ఐక్యత ఉండునో ఆ దేశం అన్ని రంగాలలోను ఉన్నతి చెందుతుంది. ఆ దేశంలో వీరులు, వివేకవంతులు ఉత్పన్నమౌతారు. ఓషధులు- ఒకసారి పంట నిచ్చి ఎండిపోవు వివిధ కాయ పప్పు ధాన్యాలు, వనస్పతులు-అనేక సార్లు పంటలనిచ్చు పండ్లు, కాయలు కాసే చెట్లు మొదలైనవి పుష్కలంగా పండును. అట్టి మా దేశం మా కీర్తిని మరింత విస్తృతం చేయునుగాక !

ఓం యస్యాం సముద్ర ఉత సిన్ధురాపో
యస్యామన్నం కృష్టయః సంబభూవుః ।
యస్యామిదం జిన్వతి ప్రాణదేజత్
సా నో భూమిః పూర్వ పేయే దధాతు ॥3॥ అథర్వవేదము. 12.1.3

ఏ దేశంలో సముద్రాలు, నదీనదాలు, వాగులు, వంకలు, సరస్సులు అన్నియు జలపూర్ణములై యుండునో, అన్నం పుష్కలంగా పండునో; ప్రజలంతా బలారోగ్యాలతో ఉద్యోగశీలురై యుందురో అట్టి మా మాతృభూమి సమస్త బోగ భాగ్యాలను ధారణ చేయునుగాక. వాటిని మాకు సదా ఇచ్చుచుండును గాక !

అంటే- మనం దేశాన్ని ఆ విధంగా తీర్చి దిద్దాలన్న మాట

ఓం యస్యాశ్చతస్రః ప్రదిశః పృథివ్యా
యస్యామన్నం కృష్టయః సంబభూవుః ।
యా బిభర్తి బహుధా ప్రాణదేజత్సా
నో భూమిర్గోష్వప్యన్నే దధాతు ॥4॥ అథర్వవేదము. 12.1.4

ఏ మా మాతృభూమిలో కర్మశీలురు, కుశల నిర్మాతలు (ఇంజనీయర్లు), వ్యవసాయ నిపుణులు, కళాకారులు కలరో; నలుదిశలా వివిధ రకాల పంటలతో అన్నపూర్ణగా వెలుగొందుచున్నదో; ఏ భూమిపై ప్రాణులన్నియు సుఖసంతోషాలతో వర్ధిల్లుచున్నవో, అట్టి దేశంలో పుట్టినందుకు నేను గర్వించుచున్నాను. అట్టి మా మాతృభూమి సదా గోవులతోను, అన్నాది పదార్థాలతోను భావితరాలను కూడా పోషించును గాక !

[మనం ఆ విధంగా మాతృదేశాన్ని తీర్చిదిద్దాలని భావం]

**ఓం యస్యాం పూర్వే పూర్వజనా విచక్రిరే**
**యస్యాం దేవా అసురానభ్యవర్తయన్ ।**
**గవామశ్వానాం వయసశ్చ విష్ఠా**
**భగం వర్చః పృథివీ నో దధాతు ॥5॥** అథర్వవేదము. 12. 1. 5

ఏ మా దేశంలోని పూర్వులు బలవీర్య పరాక్రమాదులతో విశ్వ చక్రవర్తులై విరాజిల్లిరో; విద్వాంసులు ప్రపంచ గురువులై భాసిల్లిరో; దుష్టులను, దుర్మార్గులను, దొంగలను, దోపిడీగాండ్రను జయించుచు వచ్చిరో; ఏ దేశం గో అశ్వ పశు పక్ష్యాదులకు విశేష సుఖ స్థానమో అట్టి దేశంలో పుట్టినందుకు నేను గర్వించుచున్నాను. అట్టి మా మాతృభూమి మాకును మా ముందు తరాలకును భగ వర్చస్సులను- ఐశ్వర్య జ్ఞాన పరాక్రమముల నిచ్చుచుండును గాక!

**ఓం విశ్వంభరా వసుధానీ ప్రతిష్ఠా**
**హిరణ్యవక్షా జగతో నివేశనీ ।**
**వైశ్వానరం బిభ్రతీ భూమిరగ్నిమిన్ద్ర**
**ఋషభా ద్రవిణే నో దధాతు ॥6॥** అథర్వవేదము. 12. 1. 6

మా మృతభూమి అందరిని, అన్నిటిని పోషించు విశ్వంభర. సువర్ణ రజిత రత్నాదుల గని. స్థావర జంగమ ప్రాణిజాతుల నన్నిటిని వసింపజేయు విశ్వమాత. అట్టి మా మాతృభూమి మా దేశంలోని అగ్నులకు- అగ్రగాములగు నాయకులకు,

ఇంద్ర ఋషభులకు–శత్రునాశకులగు వీరులకు, జ్ఞానులకు విశేష ధన ధాన్యముల నిచ్చుచు చక్కగా ధరించును గాక!

ఓం యాం రక్షన్త్యస్వప్నా విశ్వదానీం
దేవా భూమిం పృథివీమప్రమాదమ్ ।
సా నో మధు ప్రియం దుహామథో
ఉక్షతు వర్చసా ॥7॥

అథర్వవేదము. 12.1.7

ఏ దేశాన్ని నిద్రాలస్య ప్రమాదరహితులైన వీరులు, విద్వాంసులు సదా రక్షించుచుందరో; కృషీవరులు వివిధ పంటలను పండించుచు అన్నదాత లగుచుందురో ఆ దేశం– సర్వతోముఖోన్నతిని సాధించును. అట్టి దేశం ప్రజలకు విశేష సుఖముల నిచ్చును. కనుక మనమంతా ఐకమత్యంతో కృషి చేసి అట్టి ఉన్నతిని సాధింతుము గాక!

ఓ మాతృభూమీ ! పురుషార్థపరులమైన మాకు బల వీర్య వర్చస్సులను ప్రసాదింపుము.

ఓం యార్ణవేఽధి సలిలమగ్ర ఆసీద్యాం మాయాభిరన్వచరన్మనీషిణః ।
యస్యా హృదయం పరమే వ్యోమన్త్సత్యేనావృతమమృతం పృథివ్యాః ।
సా నో భూమి స్త్విషిం బలం రాష్ట్రే దధాతూత్తమే ॥8॥

అథర్వవేదం. 12.1.8

ఏ మాతృభూమి ప్రథమమున సముద్రము నుండి పైకి ఉబికి వచ్చి జంబూ ద్వీపంగా (ఆసియా ఖండముగా) ఏర్పడినదో, ఏ భూమి యందు లోపల వెలుపలా సర్వ వ్యాపక సర్వేశ్వరుడు వ్యాపించి యున్నాడో, ఏ భూమి పరమ వ్యోమంలో సువిశాల ఆకాశంలో విరాజిల్లుచున్నదో, ఏ భూమిని పూర్వపు రాజన్యులు, ఋషులు, మునులు, వీరులు సేవించుచు వచ్చిరో ఆ మా మాతృభూమిలో–రాష్ట్రంలో–దేశంలో విద్వత్తత, శూరత, శక్తి మత్తత సదా వర్థిల్లుచుండును గాక !

[జంబూద్వీప వివరాలకు నా రచన "మన ఇతిహాసము"లో చూడగోరుచు న్నాను]

ఓం యస్యామాపః పరిచరాః సమానీరహోరాత్రే అప్రమాదం క్షరన్తి ।
సా నో భూమిర్భూరిధారా పయో
దుహామథో ఉక్షతు వర్చసా ॥9॥

అథర్వవేదం. 12. 1. 9

ఏ భూమి యందు వర్షపు జలములు అన్ని దిక్కులకు వ్యాపించి సర్వప్రాణులకు అందుబాటులో నున్నట్లు సంన్యాసులు, పరివ్రాజకులు సర్వప్రాణులకు న్యాయాన్ని, ధర్మాన్ని, కర్తవ్యాన్ని ఉపదేశించు చుందురో అట్టి భారతదేశంలో జన్మించి నివసించుచున్నందుకు మేము గర్వించుచున్నాము. అట్టి నా దేశం పానయోగ్యములగు భోజ్య పదార్థాలను- పాలు, పెరుగు, నెయ్యి మొదలగు వాటిని పుష్కలంగా పిండును గాక! ఇచ్చును గాక! వాటితో మేము తేజస్సుతో, వర్చస్సుతో జీవింతుము గాక.

[ప్రజలు, పాలకులు దేశాన్ని ఆ విధంగా తీర్చి దిద్దాలని భావం.]

ఓం **యామశ్వినావమిమాతాం విష్ణుర్యస్యాం విచక్రమే ।**
**ఇన్ద్రో యాం చక్ర ఆత్మనేఽనమిత్రాం శచీపతిః ।**
**సా నో భూమిర్వి సృజతాం మాతా పుత్రాయ మే పయః ॥10॥**

అథర్వవేదం. 12. 1. 10

ఏ దేశమున ధర్మాత్ములైన రాజన్యులు జనులను చక్కగా పాలించుచు పోషించుచు నుందురో అట్టి దేశం మాది. శూరవీరులు గొప్ప గొప్ప పరాక్రమములను ప్రదర్శించుచు నుందురో అట్టి దేశం మాది. అట్టి మా మాతృభూమి తల్లులు బిడ్డలకు పాలు ద్రావించునట్లు సదా ఉపయోగకరములగు సంపూర్ణ పదార్థాలను ద్రావించుచుండును గాక! - ఇచ్చుచుండును గాక.

ఓం **గిరయస్తే పర్వతా హిమవన్తోఽరణ్యం తే పృథివి స్యోనమస్తు ।**
**బభ్రుం కృష్ణాం రోహిణీం విశ్వరూపాం ధ్రువాం భూమిం**
**పృథివీమిన్ద్రగుప్తామ్ । అజీతోఽహతో**
**అక్షతోఽధ్యష్ఠాం పృథివీమహమ్ ॥11॥** అథర్వవేదం. 12. 1. 11

ఉన్నతమైన గిరులతో, హిమవత్ పర్వతాలతో, పెద్ద పెద్ద అరణ్యాలతో కూడిన మా భూమాతను మేము శత్రురహితముగా చేయుదుము గాక ! దుష్టులకు ఆవాసములు కాకుండా చేయుదుము గాక! వ్యవసాయ భూములు, ఉపవనాలు మాకు పలయు పంటలను, మూలికలను, ఉపయుక్తములగు పండ్లను, కాయలను ఇచ్చును గాక! అట్టి మా మృతభూమిని మేము సదా రక్షించుకొందుము గాక !

మేము శత్రువులచే పరాజితులము కాకుందుముగాక! క్షతగాత్రులము కాకుందుముగాక! సదా మేము అధిష్టాతలముగా- స్వాములుగా ఉందుము గాక!

ఓం యత్తే మధ్యం పృథివి యచ్చ నభ్యం
యాస్త ఊర్జస్తన్వః సంబభూవుః ।
తాసు నో ధేహ్యభి నః పవస్వ మాతా
భూమిః పుత్రో అహం పృథివ్యాః ।
పర్జన్యః పితా సఉ నః పిపర్తు ॥12॥ అథర్వవేదం. 12.1.12

ఓ మాతృభూమీ ! నీ లోపలా వెలుపలా గల పదార్థాలను, నిన్నును రక్షించుకొనుటకు బుద్ధిబలము, భుజబలము గల ఉత్తమ మానవులు శక్తి వంచన లేకుండా శ్రమించుచున్నారు. అట్టి వారి రక్షణలో మమ్ము ఉంచుము. ఏలనన నీవు మాకు తల్లివి, మేము నీ పుత్రులము. వర్షాలను కురిపించి నిన్ను సస్యశ్యామలం చేయు మేఘం మాకు తండ్రి. అన్నాదులను పండించి మమ్ము పాలించుచున్నవి కనుక మేఘాలు మాకు పిత-తండ్రి వంటివి. మీరిద్దరు సదా మమ్ము రక్షింతురు గాక! పోషింతురు గాక!

ఓం యస్యాం వేదిం పరిగృహ్ణన్తి భూమ్యాం
యస్యాం యజ్ఞం తన్వతే విశ్వకర్మాణః ।
యస్యాం మీయన్తే స్వరవః పృథివ్యామూర్ధ్వాః
శుక్రా ఆహుత్యాః పురస్తాత్ ।
సా నో భూమిర్వర్ధయద్వర్ధమానా ॥13॥ అథర్వవేదం. 12.1.13

ఏ భూమియందు గృహస్థులంతా వారి వారి గృహాలలో యజ్ఞ వేదికలను నిర్మించుకొని నిత్యాగ్ని హోత్రం నిర్వహిస్తూ ఉంటారో, విశ్వకర్మలు- లోక కళ్యాణం కొరకు శ్రమించు విద్వాంసులు విశేష యజ్ఞ వేదికలను నిర్మించి వర్షేష్టి యజ్ఞాలను నిర్వహిస్తారో-వేదోపదేశాలు వినిపిస్తూ ఉంటారో ఆ దేశం పాడి పంటలతో సుభిక్షం అవుతుంది. అన్న పూర్ణ-అన్నదాత అవుతుంది. కనుక మేమంతా అట్టి ప్రయత్నం చేయుదుము గాక. మాతృభూమిని వర్ధిల్లజేయుదము గాక! అట్టి మాతృభూమి మమ్ము వర్ధిల్లజేయును గాక!

**ఓం యో నో ద్వేషత్పృథివి యః పృతన్యాద్యో౭భిదాసాన్మనసా యో వధేన।**
**తంనోభూమే రన్ధయ పూర్వకృత్వరి ॥14॥** అథర్వవేదం. 12.1.14

ఓ మాతృభూమీ! ఎవడు మమ్ము ద్వేషించునో, సేనతో దాడిచేసి మమ్ము పరాభవించదలుచునో, మాకు కీడు చేయు పథకాలను రచించునో, ఎవడు మమ్ము తన దాసులుగా చేసుకొన యత్నించునో, చంపనెంచునో వారిని నీవు నశింపచేయుము. ఓ పూర్వకృత్వరీ-పూర్వం ఎందరెందరో దోపిడీగాండ్రను నశింపజేసిన ఘనకీర్తి నీకున్నది. ఇప్పుడును, ఇకముందును కూడా అట్లే చేస్తూ మమ్ము రక్షించుము.

[వీరమాత పుత్రులమైన మనమును వీరులము కావాలని భావం]

**ఓం త్వజ్జాతాస్త్వయి చరన్తిమర్త్యాస్త్వం బిభర్షి ద్విపదస్త్వం చతుష్పదః ।**
**తవేమే పృథివి పఞ్చ మానవా యేభ్యో జ్యోతిరమృతం మర్త్యేభ్య**
**ఉద్యన్సూర్యో రశ్మిభిరాతనోతి ॥15॥** అథర్వవేదం. 12.1.15

ఓ భూమాతా! మేమంతా నీపై ఉద్భవించి తిరుగాడుచున్నాము. అట్లే ద్విపాద పక్షులు, చతుష్పాద జంతువులును ఉద్భవించి చరించుచున్నవి. నీపై చరించు పంచవిధ మానవులమైన మేమంతా (బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులము+ఇతరులము)- [విద్వాంసులు, వీరులు, వ్యాపారులు, సేవకులు మరియు ఇతరులు కూడా] నీ సేవ చేయ గోరుచున్నాము. జీవన హేతు భూతమగు తేజస్సుతో కూడిన సూర్యుడు తన కిరణములతో నిన్ను ప్రకాశపరచుచున్నాడు.

నీ కివే మా వందనాలు.

ఓం తా నః ప్రజాః సందుహ్రతాం సమగ్రా వాచో
మధు పృథివి ధేహి మహ్యామ్ ॥16॥ అథర్వవేదం. 12.1.16

ఓ మాతృభూమీ ! నీ ప్రజలమగు మేమంతా కలిసిమెలిసి సత్యము, ప్రియము, హితకరమునగు సంభాషణములు చేయుదుము గాక! అసత్యము, అహితకరము, పరుషమునైన వాక్యముల నెన్నడు పలుకకుందుము గాక! నీ పుత్రులమైన మా కట్టి శక్తిని ప్రసాదింపుము.

ఓం విశ్వస్వం మాతరమోషధీనాం ధ్రువాం
భూమిం పృథివీం ధర్మణా ధృతామ్ ।
శివాం స్యోనామను చరేమ విశ్వహా ॥17॥ అథర్వవేదం. 12.1.17

ఓ భూమాతా ! నీవు సర్వవిధ ఓషధులకు- వనస్పతి వృక్ష లతా గుల్మాదులకు తల్లివి- జనయిత్రివి. మేము సత్యము, జ్ఞానము, శూరత, వీరత మొదలైన ధర్మములతో కూడి నీ కీర్తిని దిగంతముల వరకు వ్యాపింపజేయుదుము గాక !

ఓ భూమాతా ! మా కొరకు సర్వవిధ సుఖ సాధనాలను సమకూర్చుచున్న నిన్ను మేము సదా సేవింతుము గాక !

ఓం మహత్సధస్థం మహతీ బభూవిథ
మహాన్వేగ ఏజథుర్వేపథుష్టే ।
మహాన్స్త్వేన్ద్రో రక్షత్యప్రమాదమ్ ।
సా నో భూమే ప్రరోచయ హిరణ్యస్యేవ
సన్దృశి మానో ద్విక్షత కశ్చన ॥18॥ అథర్వవేదం. 12.1.18

ఓ మాతృభూమీ ! నీవు మా అందరికి నివసించుటకు చక్కటి స్థానము నిచ్చుచున్నావు. తిరుగాడుటకు విశాల మైదానము లిచ్చుచున్నావు. విస్తరించి ఉండుట నీ స్వభావము. వినీల ఆకాశమున నీవు వేగముగా కదులుచు తిరుగుచు దేదీప్యమానంగా వెలుగొందుచున్నావు. జ్ఞానులు, వీరులు, శూరులు సదా నిన్ను

రక్షించయత్నించుచున్నారు. మమ్మును నీవు తేజస్వంతులుగా చేయుము. మాలో ధైర్య సాహసాలను నింపుము. పరస్పర ద్వేషాన్ని విడిచి ఏక మనస్కులమై నిన్ను దురాక్రమణలనుండి రక్షింతుము గాక!

**ఓం అగ్నిర్భూమ్యామోషధీష్వగ్ని మాపో బిభ్రత్యగ్నిరశ్మసు ।**
**అగ్నిరన్తః పురుషేషు గోష్వశ్వేష్వగ్నయః ॥19॥** అథర్వవేదం. 12.1.19

భూమి మధ్య భాగాన అగ్ని ఉంది. ఓషధులలో అగ్ని అప్రకటితంగా దాగి ఉంది. జలములలో కూడా స్వల్పంగా అగ్ని తత్వం ఉంది. అది విద్యుత్ రూపంలో అన్నిటిని ధరించుచున్నది. రాళ్లలోను, మనుష్యులలోను గో అశ్వాలలో కూడా అగ్ని తత్వం ఉంది.

[**వివరణ:** సృష్టిలోని పదార్థాలన్నిటిలోను సూక్ష్మంగా అగ్నితత్వం ఉంటుంది. భూమి, జలము, రాళ్లు మొదలగు వాటిలో కూడా ఉంటుంది. వృక్ష జాతులు ఎండి అగ్ని సంపర్కం కలిగినపుడు వాటిలోని అగ్ని ప్రకటితమౌతుంది. మనుష్య పశు పక్ష్యాదులలో సహజంగానే కొంత అగ్ని తత్వం ఉంటుంది. అందువల్లనే అవి జీవిస్తున్నాయి. ఆహారాలను జఠరాగ్ని జీర్ణం చేస్తున్నది.]

**ఓం అగ్నిర్దివ ఆ తపత్యగ్నేర్దేవస్యోర్వన్తరిక్షమ్ ।**
**అగ్నిం మర్తాస ఇన్ధతే హవ్యవాహం ఘృతప్రియమ్ ॥20॥**

అథర్వంవేదం. 12.1.20

ద్యు లోకమున అగ్ని సూర్యరూపంలో ఉండి భూలోక, భువర్లోకాలను (భూ అంతరిక్షాలను) ప్రకాశింప చేస్తున్నది. దానికి తోడుగా మానవులు అగ్ని హోత్రాలు చేస్తూ ఘృతాన్ని ఆహుతులుగా యివ్వాలి. ఋతుక్రమాన్ని చక్కపరచుటకు ఆ యా ఋతువులకు తగిన మూలికలతో హవ్యాన్ని ఆహుతులుగా యివ్వాలి. అది ఘృత ప్రియ-నేతిని యిష్టపడునది. హవ్యవాహిని- హవ్యాన్ని సూక్ష్మీకరించి గాలి ద్వారా అంతటా వ్యాపింప చేసి ప్రాణి మాత్రులకందరికి అందజేస్తుంది.

**ఓం అగ్నివాసాః పృథివ్యసితజ్ఞూస్త్విషీమన్తం**
**సంశితం మా కృణోతు ॥21॥** అథర్వవేదం. 12.1.21

అగ్నితో వ్యాప్తమై యుండుటవల్ల ఈ భూమి నల్లగా ఉందని తెలుసుకోవాలి. అట్టి ఈ భూమాత నన్నును అగ్ని తత్వంతో నింపి తేజస్సు కలవానిగా చేయునుగాక ! మా జ్ఞానమును, కీర్తిని, యజ్ఞమయ కర్మలను వర్థిల్లజేయునుగాక.

ఓం భూమ్యాం దేవేభ్యో దదతి యజ్ఞం హవ్యమరమన్కృతమ్।
భూమ్యా మనుష్యా౽ జీవన్తి స్వధయాన్నేన మర్త్యాః।
సా నో భూమిః ప్రాణమాయుర్దధాతు
జరదష్టిం మా పృథివీ కృణోతు ॥22॥ అథర్వవేదం. 12.1.22

మానవ ప్రాణులమైన మనమే దేవతల కొరకు అగ్ని హోత్రంలో హవ్యములను ఆహుతులుగా యివ్వాలి. వేరే ప్రాణులకు అట్టి జ్ఞానం (బుద్ధి) లేదు. అన్న పానముల వలననే మరణ శీలురైన మానవులు జీవించుచున్నారు. అట్టి అన్నపానముల కాధారం భూమాతయే. అట్టి భూమాత నాకు (మాకు) బలమైన ప్రాణశక్తిని, దీర్ఘాయువును ఇచ్చును గాక! దీనిపై వసించు మనమంతా అభ్యుదయ నిఃశ్రేయసాలను సాధింతుము గాక.

[దేవతలు 33; ఏకాదశ రుద్ర దేవతలు (11), ద్వాదశాదిత్య దేవతలు (12), అష్ట వసుదేవతలు (8), విద్యుత్ (1), యజ్ఞము (1) ఇవన్నీ కలిసి 33. వివరాలకు సత్యార్థప్రకాశంలో చదువ గోరుచున్నాము. ఈ 33 దేవతలు అగ్ని హోత్రం ద్వారా శుద్ధమౌతాయి.]

ఓం యస్తే గన్ధః పృథివి సంబభూవ
యం బిభ్రత్యోషధయో యమాపః ।
యం గన్ధర్వా అప్సరసశ్చ భేజిరే తేన
మా సురభిం కృణు మా నో ద్విక్షత కశ్చన ॥23॥ అథర్వవేదం. 12.1.23

ఓ భూమాతా! గంధములు (సువాసనలు) నీ నుండియే పుట్టుచున్నవి. వాటినే లతలు, వృక్షాలు, ఓషధులు గ్రహించుచున్నవి. దానినే నీరు గ్రహించి ప్రవహించుచున్నది. దానినే గంధర్వ అప్సరసలు (సూర్యుడు, సూర్యకిరణాలు) ధరించుచున్నవి. ప్రాణులు వాటిని అనుభవించుచున్నవి. ఓ భూమాతా! నన్నును

(మమ్మును) అట్టి సుగంధీయుతునిగా జేయుము. నీ పుత్రులమైన మేమంతా పరస్పర ద్వేషాన్ని విడిచి, మైత్రితో మెలగుదుము గాక!

ఓం యస్తే గన్ధః పుష్కరమావివేశ యం
సంజభ్రుః సూర్యాయా వివాహే ।
అమర్త్యాః పృథివి గన్ధమగ్రే తేన
మా సురభిం కృణు మానో ద్విక్షత కశ్చన ॥24॥ అథర్వవేదం. 12.1.24

ఓ మాతృభూమీ ! నీ లోని సురభిని (సుగంధాన్ని) ముందుగా కమలములు మొదలైన పుష్పాలు గ్రహించుచున్నవి. అనంతరం దానిని ఉషఃకాలపు వాయువు మొదలగు దేవతలు గ్రహించుచున్నవి. సూర్యా ఉషస్తుల వివాహ సమయాన (ప్రాతః ఉషా సూర్యుల కలయిక సమయాన) ఏ సురభి వెలువడుచున్నదో ఆ సుగంధంతో నన్ను సుగంధితుని చేయుము. మాలో నెవడును మరియొకని ద్వేషింప కుందుము గాక!

ఓం యస్తే గన్ధః పురుషేషు స్త్రీషు పుంసు భగోరుచిః ।
యో అశ్వేషు వీరేషు యో మృగేషూత హస్తిషు ।
కన్యాయాం వర్చోయద్భూమే తేనాస్మా అపి
సం సృజ మా నో ద్విక్షత కశ్చన ॥25॥ అథర్వవేదం. 12.1.25

ఓ భూమాతా ! వీర స్త్రీపురుషులలోను, రూపవంతులైన స్త్రీపురుషులలోను నీ యొక్క ఏ సుగంధయుక్త తేజస్సు ఉన్నదో; అశ్వ మృగ (లేడి) గజములలోనూ ఉన్నదో మరియు ఏ తేజస్సు యవ్వన కన్యలయందున్నదో ఆ తేజస్సుతో మమ్ములను గూడ సంయుక్తులనుజేయుము. మేము పరస్పరం ద్వేషించుకొనక ఐకమత్యంతో ఉందుము గాక!

ఓం శిలా భూమిరశ్మా పాంసుః సా భూమిః సంధృతా ధృతా ।
తస్యై హిరణ్యవక్షసే పృథివ్యా అకరం నమః ॥26॥

అథర్వవేదం. 12.1.26

భూమాత రాళ్లతోను, పర్వతాలతోను, ధూలి దూసరాలతోను కూడి యున్నను దానిని మనమంతా విద్యా విజ్ఞానాదులు గల మానవులతో అలంకరించవలసి ఉంది. ఈ భూమి రాళ్ళ రప్పలతో కూడియున్నను దీని వక్ష స్థలంలో (కడుపులో) బంగారు గనులున్నవి. ఇది రత్నగర్భ కూడా. అట్టి మాతృభూమికి మా వందనములు.

[దేశ వాసులమైన మనమంతా మనలో విద్యా విజ్ఞానాలను, బల వీర్యాలను పెంచుకొంటూ దేశమాతను రక్షించవలసి ఉంది.]

**ఓం యస్యాం వృక్షా వానస్పత్యా ధ్రువాస్తిష్ఠన్తి విశ్వహా ।**
**పృథివీం విశ్వధాయసం ధృతామచ్ఛా వదామసి ॥27॥**

అథర్వవేదం. 12.1.27

ఏ మాతృభూమి యందు వృక్ష వానస్పత్యాది వృక్ష జాతులన్నీ పుష్కలంగా ఎల్లప్పుడు స్థిరంగా ఉంటాయో ఆ దేశం మాది అని చెప్పుటకు మేము గర్వించుచున్నాము. పూర్వోక్త గుణాలతో గూడిన మా మాతృభూమిని మేము సదా ప్రశంసింతుము గాక ! రక్షింతుము గాక !

[భూమిమీద గల వృక్ష జాతులన్నిటిని రక్షించాలని భావం]

**ఓం ఉదీరాణా ఉతాసీనాస్తిష్ఠన్తః ప్రక్రామన్తః ।**
**పద్భ్యాం దక్షిణసవ్యాభ్యాం**
**మా వ్యథిష్మహి భూమ్యామ్ ॥28॥** అథర్వవేదం. 12.1.28

ఈ మాతృభూమి పై స్వేచ్ఛగా నడుచుచు, తిరుగుచు, కూర్చుంటూ, నిలబడుతూ, శయనిస్తూ కుడి ఎడమ పాదాలతో త్రొక్కుచున్నాము. అందుకు మా క్షమాపణలు తెలుపుకుంటున్నాము. మేము ఎవరికిని ఎట్టి కష్టమును, నష్టమును, దుఃఖమును కలిగింపకుందుము గాక! ఎల్లరము కలసి మెలసి సుఖంగా జీవింతుము గాక!

[మనం ఆదర్శంగా జీవించటమే మాతృభూమికి మనం చేయవలసిన సేవ.]

**ఓం విమృగ్వరీం పృథివీమా వదామి క్షమాం**
**భూమిం బ్రహ్మణా వావృధానామ్ ।**

ఊర్ధ్వం పృష్ఠం బిభ్రతీమన్నభాగం

ఘృతం త్వాభి ని షీదేమ భూమే ॥29॥ అథర్వవేదం. 12. 1. 29

పరమేశ్వర నిర్మితమైన ఈ భూమి మాకు బలాన్ని, పుష్టిని, తుష్టిని కలిగించు నేయి, పప్పు, అన్నము, పాలు, పెరుగు, పండ్లు మొదలగున వెన్నిటినో ప్రసాదించుచున్నది. ఇది సర్వప్రాణులకు నివాస యోగ్యమైనది. అట్టి మా మాతృభూమిని మేము సదా పూజింతుము గాక ! ప్రార్థింతుము గాక! ఓ మాతృభూమీ ! (త్వాం అభినిషేదమ) మేమంతా నిన్నాశ్రయించి యుందుముగాక ! వలసలు పోకుందుము గాక!

ఓం శుద్ధా న ఆపస్తన్వే క్షరన్తు యో నః

సేదురప్రియే తం ని దధ్మః ।

పవిత్రేణ పృథివి మోత్పునామి ॥30॥ అథర్వవేదం. 12. 1. 30

ఓ మాతృభూమీ! మా శరీర శుద్ధి కొరకు నీవు శుద్ధ జలాలను ప్రవహింపజేయుచున్నావు. మేము వాటిని కలుషితము చేయకుందుము గాక! భూమిని సదా శుద్ధముగా నుంచుదుము గాక! ప్లాస్టిక్ లతో, ఎలక్ట్రానిక్ వస్తువులతో మరెన్నో రకాలుగా భూ జల వాయువులు నేడు మేము కలుషితం చేయుచున్నాము. ఈ తప్పును సరిచేసుకుందుము గాక! ఓ భూమాతా ! నిన్ను అపవిత్రము చేయువారిని దూరం చేయుము. సదా పవిత్ర కర్మలు చేస్తూ నన్ను నేను పవిత్రం చేసుకొందును గాక!

ఓం యాస్తే ప్రాచీః ప్రదిశో యా ఉదీచీర్యాస్తే

భూమే అధరాద్యాశ్చ పశ్చాత్ ।

స్యోనాస్తా మహ్యం చరతే భవన్తు

మా ని పప్తం భువనే శిశ్రియాణః ॥31॥ అథర్వవేదం. 12. 1. 31

ఓ మా మాతృభూమీ ! నీ నాలుగు దిక్కులలోను, నీ నాలుగు మూలలలోను, క్రింద పైనా కూడా నుండు జనులందరు నీ హితమును కోరువారే అగుదురు

గాక! (స్యోనాఃభవన్తు) సుఖమును కలిగించు వారే అగుదురు గాక! ఈ దేశంలో ఉన్న వారంతా భ్రష్టులు కాకుందురు గాక! పతితులు కాకుందురు గాక!

[మానవుడు సామాజిక ప్రాణి. సహవాస జీవనం వల్ల మనలో కొన్ని చెడుగుణాలు ప్రవేశించవచ్చు. కనుక సామాజిక సేవతో పాటు, సామాజిక సంస్కరణ కూడా అవసరమే]

**ఓం మా సః పశ్చాన్మా పురుస్తాన్ను**
**దిష్టా మోత్తరాదధరాదుత ।**
**స్వస్తి భూమే నో భవమావిదన్పరిపస్థినో**
**వరీయో యావయా వధమ్ ॥32॥** అథర్వవేదం. 12. 1. 32

ఓ మాతృభూమీ ! నీ దశ దిశల నుండు జనులు మమ్ము నాశనమొనర్చ కుందురు గాక ! మా దేశ వీరులు, గూఢచారులు శత్రువులు గతి విధులను తెలుసుకుంటూ వారిని నాశనమొనర్తురు గాక !

[దేశ రక్షణ శక్తిని మనం ఆ విధంగా తీర్చి దిద్దవలసిన బాధ్యత మనపై ఉంది.]

**ఓం యావత్తేఽభి విపశ్యామి భూమే సూర్యేణ మేదినా ।**
**తావన్మే చక్షుర్మా మేష్టోత్తరాముత్తరాం సమామ్ ॥33॥**

అథర్వవేదం. 12. 1. 33

ఓ మాతృభూమీ ! మే మెంతవరకు తన ప్రకాశంతో ఆనందమునిచ్చు సూర్యుని సహాయంతో అన్ని వైపులా నీ విస్తారతను చూతుమో అంతవరకు మా ఆయువు పెరుగుచుండును. మా నేత్రాది ఇంద్రియములు తమ తమ పనులు చేయుటలో సమర్థములగును. అట్టి ఇంద్రియాలతో జీవించినంతకాలం మేము ఉత్తమ కర్మలే చేయుదుము గాక!

[మన ఇంద్రియ శక్తులు బలపడాలంటే సూర్యప్రకాశంలో మన పనులు చేసుకోవటం ఉత్తమం. చీకటి గదులలో, విద్యుత్ దీపాల ప్రకాశంలో చేసుకోవటం ఆరోగ్య కరం కాదు. ఇది వేద సందేశం.]

ఓం యచ్ఛయానః పర్యావర్తే దక్షిణం
సవ్యమభి భూమే పార్శ్వమ్ ।
ఉత్తానాస్త్వా ప్రతీచీం యత్పృష్టీభిరధిశేమహే ।
మా హింసీస్తత్ర నో భూమే
సర్వస్య ప్రతిశీవరి ॥34॥ అథర్వవేదం. 12.1.34

ఓ భూమాతా ! మేము రాత్రి నిదురించునపుడు నిన్నాధారం చేసుకొని పరుందము. ఆ సమయాన నీ పై అటు నిటు పలురకముల పొరలాడుదుము. మేము నీ పై వీపుల నానించి కాళ్లు పశ్చిమ దిశకు ఉంచి పండుకొందుము. అట్టి సమయంలో మమ్ము నీవే చక్కగా కాపాడుచున్నావు. నీకు మా కృతజ్ఞతాభి వందనములు. ఇట్లే నీ పుత్రులైన మమ్ము సదా అన్నివిధాల కాపాడుచుందుము.

(నిద్రపోవునపుడు తల తూర్పునకు పెట్టుట మంచిది)

**ఓమ్ యత్తే భూమే విఖనామి క్షిప్రం తదపి రోహతు ।**
**మా తే మర్మ విమృగ్వరి మా తే హృదయమర్పిపమ్ ॥35॥**

అథర్వవేదం. 12.1.35

ఓ మాతృభూమీ ! ఎత్తు పల్లములుగా నున్న నీ వెన్నును మేము నాగలితో DCBలతో దున్ని సమమొనర్చునపుడు నీకు కష్టము కలిగించుచున్నందుకు క్షమింపుము. నీ మర్మస్థలముల కెట్టి హానియు కలిగించకుందుము గాక! ఎత్తు పల్లములలో మేము పడిపోకుండునట్లు కాపాడుము. మేము విత్తు విత్తనాలు త్వరగా మొలకెత్తునట్లు అనుగ్రహింపుము. నీ యున్నతికై పాటుపడు వ్యక్తులు దుఃఖముల నందకుందురు గాక ! మేము సదా ప్రసన్నంగా ఉంటూ నీ యున్నతికై తను మనో ధనములనర్పింతుము గాక !

ఓం గ్రీష్మస్తే భూమే వర్షాణి శరద్ధే మన్తః శిశిరో వసన్తః ।
ఋతవస్తే విహితా హాయనీరహోరాత్రే
పృథివి నో దుహాతామ్ ॥36॥ అథర్వవేదం. 12.1.36

ఓ మాతృభూమీ ! వసంతాది 6 ఋతువులు-గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత, శిశిర, వసంతాదులన్నియు ఉత్తమంగా వికసించి ఉన్నాయి. ప్రతి సంవత్సరం ఇవన్నీ చక్రభ్రమణంగా వస్తూనే ఉంటాయి. ఇవన్నీ మాకు కావలసిన వివిధ సుఖాలను ప్రసాదించును గాక! ఓ మాతృభూమీ ! ప్రపంచంలో నీకన్న గొప్పదేశం లేదు. మేము సదా నీ కీర్తిని శ్లాఘించుచుందుము గాక!

ఓం యాప సర్పం విజమానా విమృగ్వరీ
యస్యామాసన్నగ్నయో యే అప్స్వాన్తః ।
పరా దస్యూన్దదతీ దేవపీయూనిన్ద్రం
వృణానా పృథివీ న వృత్రమ్ ।
శక్రాయ దధ్రే వృషభాయ వృష్ణే ॥37॥ అథర్వవేదం. 12.1.37

మా మాతృభూమిలో వేద విజ్ఞాన నిధి ఉంది. వాటిని అన్వేషించే కొలది జ్ఞాన రత్నాలు లభిస్తాయి. ఆకాశంలో కదలాడే మేఘాలలో నీటితో పాటు విద్యుదాగ్నులు దాగి ఉన్నాయి. వాటితో ఎన్నెన్నో కార్యాలు సాధించవచ్చు. వాటిలో శత్రు సంహారక అగ్నులు కూడా దాగి ఉన్నాయి. వాటితో ఆయుధాలు నిర్మించవచ్చు. మా దేశ వీరులు సజ్జనులను హింసించు దుష్టులను నాశనం చేయుదురు గాక! అట్టి మా మాతృభూమి శత్రు సంహారక వీరుల నెల్లప్పుడు ధరించుచుండును గాక! అనార్యులను-వ్యసనపరులను, పరపీడకులను తిరస్కరించును గాక!

[మిత్రులారా ! వేదాలవైపు మరలండి. అవి సృష్టికర్త నుండి వచ్చిన ఉపదేశాలు. వాటిలో మానవుల కవసరమైన జ్ఞాన విజ్ఞానాలు నిహితమైయున్నాయి.]

ఓం యస్యాం సదోహవిర్ధానే యూపో యస్యాం నిమీయతే ।
బ్రహ్మాణో యస్యామర్చన్త్యృగ్భిః సామ్నా యజుర్విదః ।
యుజ్యన్తే యస్యామృత్విజః సోమమిన్ద్రాయ పాతవే ॥38॥

అథర్వవేదం. 12.1.38

ఏ పుణ్య భూమిలో విశాలమైన ఇండ్లున్నాయో, ఆ ఇండ్లలో అగ్ని శాలలు 'హవిర్థానము' లనే పేర్లతో నిత్యం దేవ యజ్ఞాలు చేసే ప్రత్యేక గదులున్నాయో; ఏ పుణ్య భూమిలో విద్వాంసులు, ఋషులు, మునులు పరోపకార పరాయణులు తరచుగా బహిరంగ స్థలాలలో యూపస్తంభాలు నాటి మాస్యేష్టి, వర్షేష్టి వంటి పెద్ద పెద్ద యజ్ఞాలు నిర్వహిస్తారో; యజుర్వేద విధులు ఋత్విక్కులుగా నుండి పెద్దపెద్ద యజ్ఞాలు నిర్వహిస్తారో; ఎందు చతుర్వేద విధులైన విద్వాంసులు బ్రహ్మలుగా (ముఖ్య యజ్ఞనిర్వాహకులుగా) ఉండి యజ్ఞాలు నిర్వహిస్తారో; సామవేద విధులు సామగానం చేస్తూ పరమేశ్వర స్తుతి ప్రార్థనోపపాసనలు చేస్తూ, చేయిస్తూ ఉంటారో; సామగానంతో బాటు సోమపానం చేస్తారో అట్టి పుణ్యభూమిలో భరతభూమిలో పుట్టినందుకు నేను గర్విస్తున్నాను.

[సోమాపానం అంటే– సోమలతల నుండి తీసిన రసం. దానిని యజ్ఞంలో ఆహుతులిచ్చి– మిగిలిన రసాన్ని పానం చేస్తారు. అది యజ్ఞవాయువుతో పునీతమైతే చాలా గుణకారిగా ఉంటుంది. వివరాలకు నా రచన "అగ్ని హోత్రం 100% వైజ్ఞానికం" అనే గ్రంథం చదువ గోరుచున్నాము.]

వేదమాతాకు జై ! భారత మాతాకు జై !

**ఓం యస్యాం పూర్వే భూతకృత ఋషయో గా ఉదాన్నృచుః ।**
**సప్త సత్రేణవేధసో యజ్ఞేన తపసా సహ ॥39॥** అథర్వవేదం. 12.1.39

ఏ మా మాతృభూమి యందు– భరతభూమి యందు పూర్వ ఋషులు తీవ్ర తపముల నాచరించి అతీంద్రియ జ్ఞానాన్ని పొంది అద్భుత కార్యాలు చేసారో; జ్ఞాన విజ్ఞానాలను ప్రజలలో వ్యాపింపచేసారో; ఉత్తమ సంస్కారవంతులైన ఆదర్శ ఆర్యజాతిని నిర్మించారో; సప్త సత్రాలను –సప్త విధ విశేష యజ్ఞాలను, పరోపకార కార్యాలను చేసారో; అట్టి తపోమయభూమిలో జన్మించినందుకు నేను గర్వించుచున్నాను. నేనును కొన్ని యజ్ఞాలను– పరోపకార కార్యాలను చేసి మాతృభూమి కీర్తిని ఇనుమడింపజేతును గాక !

**ఓం సానో భూమిరా దిశతు యద్ధనం కామయామహే ।**
**భగో అనుప్రయుజ్ క్షామిద్ర ఏతు పురోగవః ॥40॥**

అథర్వవేదం. 12.1.40

అట్టి దివ్య గుణయుక్తమైన మా మాతృభూమి మేము కోరు సుఖాలను, ఐశ్వర్యాలను ప్రసాదించును గాక! ఐశ్వర్య సంపన్నులైన వారు మా దేశ మేధావులకు, శూర వీరులకు వలయు ఆవశ్యకతలను పూరింతురు గాక! మా రాజన్యులు శత్రు సంహారకులగు వీరులకు అగ్రగాములై దురాక్రమణ దారులపై దాడి సలుపుదురు గాక! విజయాన్ని పొందుదురు గాక !

ఓం యస్యాం గాయన్తి నృత్యన్తి భూమ్యాం మర్త్యావ్యైలబాః ।
యుధ్యన్తే యస్యామాక్రన్దో యస్యాం వదతి దున్దుభిః ।
సా నో భూమిః ప్రణుదతాం సపత్నానసపత్నం మా పృథివీ కృణోతు ॥41॥

అథర్వవేదం. 12. 1. 41

ఏ భూమి యందు ప్రజలు విజయాన్ని పొంది నృత్యాలు చేస్తూ జయ జయ గానాలు చేస్తారో; మిక్కిలిగా ప్రేరితులై వీరులు యుద్ధాలకు సన్నద్ధులౌతారో; గుఱ్ఱాలు సకిలిస్తూ యుద్ధరంగానికి పరుగులుతీయ తొందర పడుచుండునో; దుందుభులు పెద్దగా మ్రోగుచుండునో అట్టి వీరభూమి మాదని చెప్పుకొనుటకు మేము గర్వించుచున్నాము.

ఆ మా మాతృభూమి శత్రువులను, దురాక్రమణ దారులను దూరంగా తరుమును గాక ! మమ్ము శత్రురహితులనుగా చేయును గాక!

ఓం యస్యామన్నం వ్రీహియవౌ యస్యా ఇమాః పఞ్చ కృష్టయః ।
భూమ్యై పర్జన్యపత్న్యై నమోఽస్తు వర్షమేదసే ॥42॥

అథర్వవేదం. 12. 1. 42

ఏ భూమియందు వ్రీహియవలు- వరి, గోధుమ మొదలగు పంటలు విరివిగా పండునో; ఏ భూమి పై విద్వాంసులు, వీరులు, వ్యాపారులు, శ్రామికులు, సేవకులు నను పంచవిధ జనులు నివసింతురో; ఏ భూమిపై; మేఘాలు విశేషంగా వర్షించి నదులై పారునో; ఏ భూమి పర్జన్యపత్నిగా- మేఘాలచే పాలించబడే భూమిగా ప్రసిద్ధిని పొందినదో-అట్టి మా మాతృభూమికి పలుమార్లు వందనాలు. వందేమాతరం....

ఓం యస్యాః పురో దేవకృతాః క్షేత్రే యస్యా వికుర్వతే ।
ప్రజాపతిః పృథివీం విశ్వగర్భామాశామాశాం
రణ్యాం నః కృణోతు ॥43॥

అథర్వవేదం. 12. 1. 43

ఏ భూమి యందు వైదిక వాస్తు విద్యలు తెలిసిన విద్వాంసులు (Civil Engineers and Architects) అద్భుతమైన నగరాలను నిర్మింతురో; ప్రజలు స్నాన సంధ్యోపాసనలు సలుపుకొనుటకు నగరాల చుట్టూ ఉపవనాలను నిర్మింతురో; జన సమర్థమును బట్టి ప్రజల అవసరాలకు తగినట్లు వ్యవసాయ క్షేత్రాలను, పారిశ్రామిక క్షేత్రాలను నిర్మింతురో; ప్రజలను కన్నబిడ్డలవలె పాలించు ప్రజాపతులు– రాజులు, మంత్రులు, నాయకులు సదా జాగరూకులై ప్రజల ధన మాన ప్రాణాలు కాపాడుచుందురో; నగరాలను రమణీయ ప్రదేశాలుగా తీర్చిదిద్దుచుందురో అట్టి దేశం మాది. దానిని మేము మరింత రమణీయంగాను, స్వచ్ఛంగాను చేయుదుము గాక!

ఓం నిధిం బిభ్రతీ బహుధా గుహావసు
మణిం హిరణ్యం పృథివీ దదాతు మే ।
వసూని నో వసుదా రాసమానా
దేవీ దధాతు సుమనస్యమానా ॥44॥

అథర్వవేదం. 12. 1. 44

హిరణ్య రజత లోహ తామ్రాది అనేక రకాల గుహలతో– గనులతో కూడి యున్న మా భరతమాత వజ్ర వైడూర్య మరకత మాణిక్యాది మణులను– రత్నాలను కూడా తన గర్భంలో ధరించి ఉంది. ఇవన్నీ ఆమె పుత్రులమైన మాకు చాలా కాలంగా యిచ్చుచునే యున్నది. అనేకానేక ధనములను దానము చేయు ఆ మా మాతృభూమి దేవీ స్వరూపిణి. ఆమె సదా ప్రసన్నయై ఇక ముందును మాకు ఇచ్చుచుండును గాక.

[మన భరతమాత రత్నగర్భ. మనం భూ విజ్ఞానాన్ని ఉపయోగించుకొని అన్వేషిస్తే మరెన్నో గనులు బయట పడగలవు. పెట్రోలువంటి చమురు గనులు కూడా బయట పడగలవు]

ఓం జనం బిభ్రతీ బహుధా వివాచసం
నానాధర్మాణం పృథివీ యథౌకసమ్ ।
సహస్రం ధారా ద్రవిణస్య మే దుహాం
ధ్రువేవ ధేనురనపస్ఫురన్తీ ॥45॥ అథర్వవేదం. 12.1.45

బహువిధ భాషలను, ధర్మములను, సంప్రదాయములను గల జనులతో గూడిన మా భరతభూమి ఒకే ఇంటివారుగా కలసిమెలసి జీవించు పౌరులతో నిండియున్నది. అట్టి నాశరహితమైన మా మాతృభూమి ప్రజలకు వలయు పలు విధములగు భోగములను గోమాత దూడకు పాలనిచ్చునట్లుగా చేకూర్చునుగాక!

[దేశ పరిపాలనా శక్తిని మనం ఆ విధంగా తీర్చి దిద్దవలసిన బాధ్యత మనపై ఉంది.]

ఓం యస్తే సర్పో వృశ్చికస్తృష్టదంశ్మా
హేమన్తజబ్ధో భృమలో గుహాశయే ।
క్రిమిర్జిన్వత్పృథివి యద్యదేజతి ప్రావృషితన్నః
సర్పన్మోప సృపద్యచ్ఛివం తేన నో మృడ ॥46॥ అథర్వవేదం. 12.1.46

ఓ మాతృభూమీ ! నీ పైన బిలములలో ఉంటూ వర్షాదులు పడినపుడు బయటకు వచ్చి ప్రాకులాడుచుండు సర్ప వృశ్చికాదులు మమ్ము కాటు వేయవచ్చును. విదాహాన్ని, వేడినీ, జ్వరాదులను, మంటలను, పోట్లను కలిగించవచ్చు. కొన్ని విషాలు తలత్రిప్పును, నురగలను కక్కించి మరణమును కూడా కలిగించవచ్చును. పరమేశ్వరానుగ్రహం వల్ల అట్టివి మా వద్దకు రాకుండును గాక! మేమును తగిన జాగ్రత్తలు తీసుకుంటూ తిరుగాడుచుందుము గాక! ఓ భూమాతా ! ఒకవేళ అట్టివి మమ్ము కాటువేసినను ఆ విషాన్ని హరించు మూలికలను మాకు ప్రసాదింపుము.

[సృష్టిలో పర్యావరణ సమతుల్యతకు అన్ని రకాల ప్రాణులు అవసరమే నంటున్నారు పర్యావరణ నిపుణులు. సర్ప వృశ్చికాది విష ప్రాణులు కూడా గాలిలోని విషాలను గ్రహించి వాటిని తమ కోరలలో లేదా కొండెలలో విషాలుగా

మార్చుకొని తమ ప్రాణరక్షణకు వాడుకుంటాయట. ఆ రకంగా అవి గాలిని శుద్ధిచేస్తాయట.

ఈ మంత్రం విష సర్పాదుల నుండి మీరు జాగ్రత్త వహించండని బోధిస్తున్నది. విషహర చికిత్సలను రూపొందించుకోమనియు ప్రేరేపిస్తున్నది. ఆయుర్వేదంలో విషహర చికిత్స లెన్నో చెప్పబడ్డాయి. వాటిపై విస్తృత పరిశోధనలు జరిపి, వాటిని జనసామాన్యానికి అందుబాటులో ఉంచటం చాలా అవసరం.]

ఓం యే తే పన్థానో బహవో జనాయనా
రథస్య వర్త్మానసశ్చ యాతవే।
యైః సంచరన్త్యుభయే భద్రపాపాస్తం
పన్థానం జయేమానమిత్రమతస్కరం
యచ్ఛివం తేన నో మృడ ॥47॥ అథర్వవేదం. 12. 1. 47

ఓ మాతృభూమీ ! నీ పైన జనులు నడచుటకు, తిరుగుటకు అనేక మార్గములు (రోడ్లు) కలవు. వాటిపై రథాలు, బండ్లు, ద్విచక్ర, త్రిచక్ర, చతుశ్చక్ర వాహనాలు ఎన్నెన్నో తిరుగుచుండును. సజ్జనులు,దుర్జనులు కూడా తిరుగుచుందురు. తస్కరులు (దొంగలు) దోపిడీ గాండ్రు దోచుకోవటానికి చూచుచుందురు. మాకు కష్ట నష్టాలు కలిగించుదురు. శత్రువులు ఆక్రమణలు చేయ చూతురు. కనుక మేము ముందు ఆ మార్గాలను తస్కరరహితంగాను, శత్రురహితంగాను చేయుదుము గాక! ఓ మాతృభూమీ ! మాకట్టి శక్తి యుక్తులనిచ్చి కాపాడుము. మాకు సదా జయాన్ని, సుఖసంతోషాలను కలిగింపుము.

ఓం మల్వం బిభ్రతీ గురుభృద్భద్రపాపస్య నిధనం తితిక్షుః ।
వరాహేణ పృథివీ సంవిదానా సూకరాయ
వి జిహీతే మృగాయ ॥48॥ అథర్వవేదం. 12. 1. 48

భూమాత గురుభృత్‌- బరువైన వస్తువులను తన పైకి ఆకర్షించి చక్కగా ధరిస్తుంది. సజ్జనులను, దుర్జనులను కూడా సహనంతో తనపై మోస్తుంది. శుద్ధ

జలాలను వర్షించు మేఘాలు సూర్య కిరణాల సాయంతో వర్షించి మలమూత్రాలతో అపవిత్రమౌతున్న భూమాతను పవిత్రం చేస్తాయి. అట్టి మన భూమాత విశిష్ట పద్ధతిలో సూర్యుని చుట్టూ తిరుగుచున్నది.

[వైదిక నిఘంటువు (1-10) ననుసరించి వరాహమంటే ఉత్తమ జలాన్నిచ్చే మేఘమని అర్థం. సూకరము అంటే మంచిగా చేయునది. ఇక్కడ మంచి కిరణములు గల సూర్యుడు అని అర్థం.]

**ఓం యే త ఆరణ్యాః పశవో మృగా వనే హితాః**
**సింహా వ్యాఘ్రాః పురుషాదశ్చరన్తి ।**
**ఉలం వృకం పృథివి దుచ్ఛునామిత**
**ఋక్షీకాం రక్షో అపబాధయాస్మత్ ॥49॥** అథర్వవేదం (12-1-49)

ఓ మాతృభూమీ ! నీ అడవులలో ప్రాణులను చంపి వాని మాంసాన్ని తినే పులులు, సింహాలు, తోడేళ్లు, భల్లూకాలు మొదలైన క్రూరమృగాలుంటాయి. అట్లే గడ్డి గాదములు తింటూ తిరిగే లేళ్లు, జింకలు మొదలైనవి కూడా ఉంటాయి. ఇవేవీ మా జనావాసాలకు వచ్చి మమ్ము బాధించకుందును గాక! అట్టి జాగ్రత్తలు మేము తీసుకుంటూ మమ్ము మేము రక్షించుకొందుము గాక!

**ఓం యే గన్ధర్వా అప్సరసో యే చారాయాః కిమీదినః ।**
**పిశాచాన్సర్వా రక్షాంసి తానస్మద్భూమే యావయ ॥50॥**

అథర్వవేదం. 12. 1. 50

ఓ మాతృభూమీ ! నీపై పరపీడకులు, సోమరులు, బద్ధకస్తులు, దొంగలు, రాక్షసులు (మాంసాహారులు), నాస్తికులు, ఆతతాయులు ఉండకుందురు గాక! మా రాజులు అట్టివారిని శిక్షించి దారిలోనికి తెత్తురు గాక! ప్రజలు నిర్భయముగా నుందురుగాక !

[వేదాలలో గంధర్వ అప్సర పదములు అనేక పర్యాయాలు వస్తాయి. ఈ రెండు పదములు అనేకార్థాలను కలిగి ఉన్నాయి. అన్ని చోట్లా ఒకే అర్థం అన్వయించకూడదు. సందర్భాన్ని బట్టి అర్థం చేసుకోవలసి ఉంటుంది. ఈ పృథివీ

సూక్తం లోని 23వ మంత్రంలో గంధర్వ అప్సర పదములకు సూర్యుడు, సూర్యకిరణాలు నని అర్థం చెప్పుకోవటం జరిగింది. ఈ 50వ మంత్రంలో చోరులు, పరపీడకులు, పిశాచులు రాక్షసులు, సోమరులతో కలిపి ఈ పదములు ప్రయోగించబడ్డాయి. కనుక గంధర్వులంటే పరహింసకులనీ, అప్సరసలంటే కర్మవిముఖ సోమరులు నని అర్థం చెప్పుకోవటం జరిగింది. ఒక చోట రోగకారక క్రిములుగా ప్రయోగింపబడ్డాయి.]

ఓం యాం ద్విపాదః పక్షిణః సంపతన్తి హంసాః
సుపర్ణాః శకునా వయాంసి ।
యస్యాం వాతో మాతరిశ్వేయతే రజాంసి
కృణ్వాం శ్చ్యావయంశ్చ వృక్షాన్ ।
వాతస్య ప్రవాముపవామనువాత్యర్చిః ॥51॥ అథర్వవేదం. 12. 1. 51

ఏ భూమియందు ఆకాశంలో హంసలు, గరుత్మంతులు, చిలుకలు, పావురాలు మొదలైన వాయుచరాలన్నీ స్వేచ్ఛగా ఎగురుచుండునో; పక్షులు లేపిన సూక్ష్మధూళి ఆకాశమున ఉండునో; అప్పుడప్పుడు తుఫానుల వంటివి ఏర్పడి కొన్ని చెట్లను కూల్చివేయుచుండునో; అప్పుడప్పుడు అడవులు తగులబడుచుండునో అట్టి వైవిధ్యాలతో కూడిన భూమి మా మాతృభూమి యని చెప్పు కొనుటకు మేము గర్వించుచున్నాము.

ఓం యస్యాం కృష్ణమరుణం చ సంహితే
అహోరాత్రే విహితే భూమ్యామధి ।
వర్షేణ భూమిః పృథివీ వృతావృతా సా నో
దధాతు భద్రయా ప్రియే ధామని ధామని ॥52॥ అథర్వవేదం. 12. 1. 52

ఏ భూమిపై పగలు, రాత్రి, ఉభయ సంధ్యలు సరియైన ప్రమాణాలతో వ్యవస్థా బద్ధంగా ఏర్పడుతున్నాయో; వర్షాకాలంలో వర్షాలచే కప్పబడి భూమియంతా సస్యశ్యామల మగుచున్నదో అట్టి మా విశాల మాతృభూమి మాకు చక్కటి వసతి

నిచ్చి కాపాడుచుండును గాక! మేము కష్టించి వ్యవసాయం చేసి మా మాతృభూమిని అన్న పూర్ణను, అన్నదాతను చేయుదుము గాక!

**ఓం ద్యౌశ్చ మే ఇదం పృథివీ చాన్తరిక్షం చ మే వ్యచః ।**
**అగ్నిః సూర్య ఆపో మేధాం విశ్వే దేవాశ్చసం దదుః ॥53॥**

అథర్వవేదం. 12. 1. 53

ఈ మా మాతృభూమి యందలి పృథివీ అంతరిక్ష ద్యులోకాలు; అగ్ని సూర్య జలాదులు అన్నీ మాకు మేలు చేయునవే అగును గాక! సర్వదేవతలు, విద్వాంసులు, వీరులు, చతురులు, శిల్పులు, కృషీవరులు అంతా నాకు సహకరించి నా మేధస్సును మరింత వికసింప చేయుదురు గాక! నేను తేజస్సును, ఓజస్సును, బల వీర్యాలను పొందుదును గాక !

**ఓం అహమస్మి సహమాన ఉత్తరో నామ భూమ్యామ్ ।**
**అభీషాడస్మి విశ్వాషాడాశామాశాం విషాసహిః ॥54॥**

అథర్వవేదం. 12. 1. 54

నేను నా మాతృభూమిలోని కొరతలను పూరించి పుష్టివంతం చేయుదును గాక! అందుకొరకు ఎన్ని కష్టాలనైన సహింతును గాక! ప్రయత్న పూర్వకముగా అంతః బహి శత్రువుల నందరిని నశింప చేయుదును గాక! నా దేశాన్ని శత్రు రహితంగా ఉండుటకు తగిన జాగ్రత్తలు తీసుకొందును.

**ఓం అదో యద్దేవి ప్రథమానా పురస్తాద్దేవైరుక్తా వ్యసర్పో మహిత్వమ్ ।**
**ఆ త్వా సుభూతమవిశత్తదానీమకల్పయథాః ప్రదిశశ్చతస్రః ॥55॥**

అథర్వవేదం. 12. 1. 55

ఓ దివ్య మాతృభూమీ ! మా పూర్వదేవతలు, ఋషులు, మునులు, విద్వాంసులు, వీరులు, రాజులు, మంత్రులు, కళాకారులు నీ కీర్తిని ఎంతగానో ఇనుమడింప చేసిరి. నలుదిశలా నీ కీర్తి వ్యాపించి నీవు ప్రపంచ ప్రసిద్ధిని పొందితివి. నీ పుత్ర పుత్రికలమైన మేమును నీ కీర్తిని నలుదిశలా వ్యాపింపజేయుదుము గాక ! ఇకముందును కీర్తి యిట్లే చిరస్థాయిగా ఉండును గాక!

ఓం యే గ్రామా యదరణ్యం యాః సభా అధి భూమ్యామ్ ।
యే సంగ్రామాః సమితయస్తేషు చారు వదేమ తే ॥56॥

అథర్వవేదం. 12. 1. 56

ఓ మాతృభూమీ ! నీపై ఏ ఏ గ్రామాలు, నగరాలు, అరణ్యాలు గలవో వాటన్నిటిలోను మేము నీ కీర్తినే గానం చేయుదుము గాక! సభలలో, సమావేశాలలో, పరిషత్తులలో నిన్నే ప్రశంసింతుము గాక! యుద్ధాలలో, సంగ్రామాలలో కూడా నీ జయ జయ ధ్వనులే పలుకుదుము గాక! నీ కీర్తికి, ఉత్కృష్టతకు మచ్చుతెచ్చు మాటలు చెప్పకుందుము గాక !

ఓం అశ్వ ఇవ రజో దుధువే వి తాఞ్జనాన్య
ఆక్షియన్పృథివీం యాదజాయత ।
మన్ద్రాగ్రేత్వరీ భువనస్య గోపా
వనస్పతీనాం గృభిరోషధీనామ్ ॥57॥ అథర్వవేదం. 12. 1. 57

గుఱ్ఱాలు యుద్ధభూమిలో వీరులతో పాటు వీరంగం చేస్తాయి. పరుగులు తీస్తూ శత్రువులపై విరుచుకు పడతాయి. శత్రువులకు భయ భ్రాంతులను కలిగిస్తాయి. అనంతరం ఆనందంతో తమ వంటిపై పడిన ధూళిని వదిలించి వేస్తాయి. అట్లే సేనాపతులు, రాజులు, సైనికులు ఆక్రమణ దారులపై, చొరబాటు దారులపై లంఘించి దూరంగా తరిమి వెయ్యాలి లేదా అంతమొందించాలి. సదా మన మాతృభూమిని ప్రసన్నంగా, అగ్రేసరిగా ఉంచాలి. వనస్పతులతో (ఫలభరిత చెట్లతో), ఓషధులతో (కాయ పప్పు తైల ధాన్యాలతో) అన్నపూర్ణగా, అన్నదాతగా తీర్చిదిద్దాలి.

ఓం యద్వదామి మధుమత్తద్వదామి యదీక్షే తద్వనన్తి మా ।
త్విషీమానస్మి జూతిమానవాన్యాన్హన్మి దోధతః ॥58॥

అథర్వవేదం. 12. 1. 58

దేశ సంబంధంగా నేనేమి పలికినా అది మధురంగాను, హితకరంగాను ఉండును గాక! నే నేది చూతునో అది నాకు సహాయకమగును గాక! ప్రజలు, వస్తువులు అన్నీ నా కనుకూలంగా ఉండును గాక! నేను ప్రకాశవంతుడను, తేజస్విని, జ్ఞానవంతుడను అగుదును గాక! దేశ ద్రోహమొనర్చు అంతః బహిః శత్రువుల నందరిని అంతమొందింతును గాక!

ఓం శన్తివా సురభిః స్యోనా కీలాలోధ్నీ పయస్వతీ ।
భూమి రధి బ్రవీతు మే పృథివీ పయసా సహ ॥59॥

అథర్వవేదం. 12.1.59

శాంతికారకము, సుగంధ యుక్తము, సుఖదాయకమునైన భోజనాన్ని, పుష్కలమైన జలాన్ని ఇచ్చుచున్న మా మాతృభూమి సదా మాకు సర్వభోగాలను ఇచ్చుచుండును గాక! మమ్ముల నెల్లప్పుడు రక్షించుచుండును గాక! మేమును ఎల్లప్పుడూ మాతృభూమి రక్షణకు, ఉన్నతికి పాటుపడుదుము గాక!

ఓం యామన్వైచ్ఛద్ధవిషా విశ్వకర్మాన్తరర్ణవే రజసి ప్రవిష్టామ్ ।
భుజిష్యం పాత్రం నిహితం గుహా
యదావిర్భోగే అభవన్మాతృమద్భ్యః ॥60॥ అథర్వవేదం. 12.1.60

ఏ దేశమున పురుషార్థపరులైన మానవులు మాతృభూమి కొరకు ఎట్టి సేవనైనా చేయ కటిబద్ధులై ఉందురో వారికి భూగర్భ విజ్ఞానం విశదమౌతుంది. అట్టి దేశ భక్తులకు భూమాత తనలోని భోగ్య పదార్థాలను- వివిధ రకాల పంటలను, వివిధ రకాల గనులను తెరిచిపెడుతుంది.

ఓం త్వమస్యావపనీ జనానామదితిః కామదుఘా పప్రథానా ।
యత్త ఊనం తత్త ఆ పూరయాతి
ప్రజాపతి ప్రథమజా ఋతస్య ॥61॥ అథర్వవేదం. 12.1.61

ఓ మాతృభూమీ ! నీవు జనులకు

అదితివి- ఎవరికి ఎట్టి దుఃఖమును కలిగింపని దానవు.

కామదుఘా-కోరిన పదార్థాల నిచ్చుకామధేనువు.

సుప్రథానా- పెక్కు దివ్యగుణములు గల నీవు స్తుతింప దగినదానవు.

అవపనీ-మంచిగా దున్ని సేంద్రియ ఎరువులు వేసి తగినంత నీరు పోస్తే మిక్కిలిగా ఆ ధాన్యాలను పండించుదానవు. అట్టి నీలో ఏవేని కొరతలున్నచో వాటిని సృష్టి ప్రారంభమున జనించిన ప్రజాపతి దేవత (యజ్ఞ దేవత-అగ్ని హోత్ర దేవత) వాటిని పూరించును గాక!

[శ్లో. **సహ యజ్ఞాః ప్రజా సృష్ట్వా । పురోవాచ ప్రజాపతిః ।**
**అనేన ప్రసవిష్యధ్వమ్ ఏష వోఽస్త్విష్టకామధుక్ ॥** - భగవద్గీత 3.10

పరమేశ్వరుడు సృష్ట్యాదిలో మానవులతో పాటు యజ్ఞాలను సృజించి ఇట్లుపదేశించాడు - "ఓ మానవులారా ! ఈ యజ్ఞాల ద్వారా మీ మీ కోరికలను నెరవేర్చుకోండి. ఇవి మీ కోరికలను నెరవేర్చే కామధేనువు" అన్నాడు.

అది ఎలా సాధ్యమో మరొక 6 శ్లోకాలలో వివరించాడు. ఈ విషయాలు వివరంగా తెలుసుకోగోరేవారు నా రచన "అగ్ని హోత్రం 100% వైజ్ఞానికం" చదువ గోరుచున్నాను.]

**ఓం ఉపస్థాస్తే అనమీవా అయక్ష్మా**
**అస్మభ్యం సన్తు పృథివి ప్రసూతాః ।**
**దీర్ఘం న ఆయుః ప్రతిబుధ్యమానా**
**వయం తుభ్యం బలిహృతః స్యామ॥62॥** అథర్వవేదం. 12.1.62

ఓ పృథివీ ! విశాల భూమాతా! నీవు ప్రసూతవు- చక్కని పంటలను పండించి నీ పుత్ర పుత్రికలమైన మా అందరిని పాలించి పోషించుదానవు. మాకే కాక స్థావర జంగమ ప్రాణులన్నిటిని పోషించదానవు. నీ ఒడిలో మేమంతా అనమీవా- క్రిమి రోగ రహితులము, అయక్ష్మా- కృశత్వాది రోగ రహితులమునై బల పరాక్రమాలతో వర్థిల్లుదుము గాక! ఓ తల్లీ ! నీ కృపవలన మేమంతా దీర్ఘాయుష్మంతుల మగుదుము గాక! మేము జ్ఞాన విజ్ఞాన యుక్తులమగుచు నీ

కొరకు బలిని అనగా పన్నులను చెల్లించువార మగుదుము గాక ! నీ సేవకై మా తను, ధన ప్రాణముల నర్పించు వారము అగుదుము గాక!

ఓం భూమే మాతర్ని ధేహి మా
భద్రయా సుప్రతిష్ఠితమ్ ।
సంవిదానా దివా కవే శ్రియాం
మా ధేహి భూత్యామ్ ॥63॥ అథర్వవేదం. 12. 1. 63

ఓ భూమాతా ! నీ పుత్ర పుత్రికలమైన మాకు భద్రమైన- కల్యాణకరమైన వివేక బుద్ధిని ప్రసాదింపుము. మాకు తగిన సంపదలనిచ్చి సుస్థిరులను చేయుము. నీవు గతిశీలివి. నిరంతరం నీ చుట్టూ నీవు తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగుచున్నావు. నీపై ఉన్న అన్ని ప్రాంతాలకు దిన రాత్రులను, ఋతువులను కలిగించుచున్నావు. నీ వలెనే మేమును కర్మ శీలురము, పరోపకార పరాయణులము అగుదుము గాక! ఓ తల్లీ ! నీలో గనుల రూపంలో ఉన్న విశేష సంపదలను మాకు ప్రాప్తింప జేయుము- భూగర్భవి జ్ఞానము నిచ్చి విశిష్ట జ్ఞానవంతులను చేయుము. ఓ భరతమాతా ! నీ కివే మా కృతజ్ఞతాభివందనములు.

## పృథ్వీ సూక్తము సమాప్తము

# పృథ్వీ సూక్త సారాంశం

రచయిత

కళా ప్రపూర్ణ పం. గోపదేవశాస్త్రి

వ్యవహార భాషీకరణం

డా॥ మట్టి కృష్ణారెడ్డి. M.A.M.Ed.Ph.D. D.lit.,

ఓ౩మ్

# పృథ్వీసూక్త సారాంశం

## మాతృభూమి సుయోగ్య శాసనం:

ఏ ఉత్తమ రాజ్యశాసనం వల్ల ప్రజలసుఖం వర్ధిల్లుతుందో అదే రాజ్యం. ఇందు సందేహంలేదు. కాని; ఏది ఉత్తమ రాజ్యం? ఇది ఒక విచారణీయ విషయం. నేడు భూమిపై అనేక రాజ్యశాసనాలున్నాయి. రష్యాలో సామ్యవాద శాసనం; అమెరికాలో ప్రజాతంత్రీయ రాజ్యశాసనం; ఇలాగే అనేక దేశాలలో అన్యరాజ్య శాసనా లున్నాయి.

ప్రాచీన కాలంలో విభిన్న రాజ్య శాసన ప్రణాళికలు ఉండేవి. రాజ్యం, మహారాజ్యం, స్వరాజ్యం, సామన్త రాజ్యం, భౌజ్యం, వైరాజ్యం, ఆధిపత్యమయ రాజ్యం, జానరాజ్యం మొదలైన అనేక రాజ్యశాసనాలు వేదాలలోను, బ్రాహ్మణాలలోనూ మనకు దృష్టిగోచరమవుతున్నాయి. ఇప్పుడు విభిన్న రాజ్యాలున్నట్లు వేదకాలంలో కూడా ఉండేవి. బ్రాహ్మణగ్రాంథాలలో ఏ దిశలో ఎలాంటి రాజ్యశాసనం ఉండేదో వర్ణించబడింది. ఇంతేకాక బ్రాహ్మణంలో సంపూర్ణ పృథ్వీపై ఒకే రాజ్యానికి సంబంధించిన శాసన కామన మనం చూడగలం - ఐతరేయ బ్రాహ్మణవచనం చూడండి!

"సముద్ర పర్యన్తాయాః పృథివ్యాః ఏకరాట్" – ఐ.బ్రా.

"సముద్రం వరకుగల పృథ్వీ అంతటికీ రాజు ఒక్కడే ఉండాలి. రాజ్యశాసనం ఒక్కటే ఉండాలి. నేడు సంయుక్త రాష్ట్రసంఘ కల్పనలాగానే **'పృథివ్యాః ఏకరాట్'** భూమికి అంతటికీ ఒకే రాజు ఉండాలనే కల్పన పూర్వం చూడగలము. వేరు

వేరు రాజ్యాలు స్వతంత్రాలై ఉండే పక్షంలో వాటిలో పరస్పరం యుద్ధాలు జరగటం అసంభవంకాదు. అట్లా యుద్ధాలు జరిగి మానవసంహారం కలగక ఉండాలనే కారణంతోనే ఋషులు భూమి అంతటికీ ఒకే రాజు ఉండాలి. "పృథివ్యాః ఏకరాట్" కల్పన చేసి ఉంటారు. నేటి సంయుక్త రాష్ట్ర సంఘం కూడా ఆ ప్రాచీనకాలపు కల్పనకు ఆధునికరూపమే అవుతుంది. కానీ, దాని ఉద్దేశం ఎంతవరకు ఫలించింది? అనే విషయం ఇక్కడ చర్చనీయాంశం. పృథ్వి అంతటా ఒక్క రాజ్యం. ఒకే విధానం ఉండాలనే కల్పన నేటిదే కానీ, ప్రాచీన మంత్రద్రష్టల మస్తిష్కంలో ఎన్నడూ ఇలాంటి కల్పన కలగలేదనటం మిక్కిలి అసంగతం. ఎల్లపుడూ జ్ఞానులు, సజ్జనులు సంపూర్ణ మానవతకు హితం కలగవలెనని, మానవులు వ్యర్థంగా సంహరించబడరాదని మాత్రమే ఆలోచిస్తారు. అలాంటి ఆలోచనలవల్లనే సంయుక్త రాజ్యశాసనానికి సంబంధించిన కోరిక ఉదయిస్తుంది. ఆ కల్పన ఉద్భవిస్తుంది. నేటి మానవులలో కల్పన ఉదయించినట్లే నాటి నాయకులలో పుట్టిన **"పృథివ్యా ఏకరాట్"**లోను చూస్తాము.

"పృథ్వి అంతటా ఒక రాజ్యం ఉండాల"నే కల్పన బ్రాహ్మణ గ్రంథాలలో చూస్తున్నాము; కానీ చరిత్రలో అలాంటి శాసనం ఏర్పడినట్లు మనకు గోచరం కాదు. కాబట్టి ఈ కల్పన అప్పటి ఋషులలో, నాయకులలో ఉత్పన్నమైతే అది కార్యరూపంలో పరిణమించి ఉండకపోవచ్చు.

నేడు కూడా **"సంయుక్త రాష్ట్ర సంఘం"** పేరులో ఉన్నది కానీ లోకంలో దానికి ఎలాంటి సఫలత కలిగిందో చెప్పలేము. ఎందుకంటే ప్రతీరాష్ట్ర స్వార్థం దానికి అడ్డుపడుతుంది. దానివలన మూల ఉద్దేశం నష్టమవుతుంది. మానవ స్వభావమే అలాంటిది. అది పూర్వంలోనూ, భవిష్యత్తులోనూ అలాగే ఉంటుంది.

ప్రాచీన కాలంలో ఈ పృథ్విలో అనేక రాజ్యాలున్నాయి. వానిలో కలహాలు, సంగ్రామాలు జరుగుతూ ఉండేవి. వారిలోనే "పృథ్వి అంతటా ఒక్క రాజ్యం" ఉండాలనే కల్పన ఆవిర్భవించింది. కానీ, పృథ్వి అంతటా ఒక్క సంపూర్ణ రాజ్యమేర్పడలేదు. మానవుల బౌద్ధిక ఉన్నతి రాజ్యం, సామ్రాజ్యం, స్వరాజ్యం వరకే కలిగినది. ఆ తర్వాత పృథ్వి అంతట ఒకే రాజ్యం ఉండనంత వరకు ఉన్నతి

కలుగదనే చెప్పాలి.

వేదాలలో స్వరాజ్యానికి అర్థం "బహుపాయ్య స్వరాజ్యం" ఒక రాజుయొక్క నియంత్రిత రాజ్యశాసన రాజ్యం అనబడుతుంది. లోకనియంత్రిత రాజ్యశాసనాన్ని "బహుపాయ్య స్వరాజ్యం" అంటారు. వేదంలో సర్వవిధ శాసనాలు ఉన్నాయి. వాటిలో "బహుపాయ్య స్వరాజ్య శాసన" మహిమ విశేషంగా ఉంది.

## మాతృభూమి మీద ప్రేమ:

దేశంలో ఎలాంటి రాజ్యశాసనం వున్నా ప్రతి రాజ్య శాసనంలోనూ జనులలో మాతృభూమిపై ప్రేమ తప్పక ఉండాలి. వేదంలో గల మాతృభూమి-సూక్తం ఈ దృష్టితోనే మననం చేయదగినది. లోకంలో ఏ మతగ్రంథంలోనూ మాతృభూమికి సంబంధించిన భక్తివిషయంలో ఏమీ చెప్పబడ లేదు. వేదంలో మాత్రమే మాతృభూమి సూక్తం ఉంది. అది కూడా కొంచెం కాదు. అది ఒక విస్తృత సూక్తం. ఆలోచనా పరుడైన ప్రతివ్యక్తికీ ఈ సూక్తం ఆశ్చర్యం కలిగించకపోదు.

వేదంలో ఉన్న మానవధర్మం యొక్క పూర్ణత ఈ సూక్తంవలన స్పష్టమవుతుంది. మానవ జీవన వ్యవహారంలోగల సర్వదశలకు సంబంధించిన ఉత్తమ ఉపదేశాలు వేదంలో చూడవచ్చు. ఈ చిన్న పుస్తకంలో మాతృభూమికి సంబంధించిన భక్తి విశేషాలు పాఠకులు చదివారు కదా!

## మాతృభూమిని ధరించే గుణాలు:

మాతృభూమి ఎలాంటి గుణాలు కలవారు ధరిస్తారో - రక్షిస్తారో ఈ సూక్తపు ప్రథమ మంత్రంలో ఇట్లు వర్ణించపబడింది:

**"సత్యం బృహద్ ఋతం ఉగ్రం దీక్షాతపో, బ్రహ్మ**
**యజ్ఞః పృథివీం ధారయన్తి"** (అథర్వ - 12.1.1)

'సత్యం, సరలత, ఉగ్రత, దక్షత, ధర్మనియమ పాలనం చేసేటప్పుడు కలిగే కష్టాలను సహించటం (తపస్సు) జ్ఞానం, యజ్ఞభావన అనే ఈ గుణాలు మాతృభూమిని రక్షిస్తాయి. మాతృభూమిని స్వతంత్రంగా ఉంచటానికి ప్రజలలో ఉపయుక్త గుణాలుండటం మిక్కిలి ఆవశ్యకం. ఏ దేశపు ప్రజలు ఈ గుణసంపద

కలిగి ఉంటారో ఆ మాతృభూమి స్వతంత్రమై తేజోయుక్తమై ఉజ్జ్వలకాంతితో ప్రకాశిస్తుంది. ఆ మాతృభూమి పరాక్రమవంతుల తల్లి అవుతుంది.

**"యస్యాం పూర్వే పూర్వజనా విచక్రిరే యస్యాం**
**దేవా అనురానభ్యవర్తయన్"** (అథర్వ - 12.1.5)

'ఏ మాతృభూమిలో పూర్వజులు మిక్కిలి పరాక్రమం ప్రదర్శించారో, ఏ మాతృభూమిలో దేవతలు-విద్వాంసులు అసురులను దూరం చేసారో' అనే సాధారణ ప్రాచీన-ఇతిహాసం ఈ మంత్రం గుర్తింపచేస్తున్నది. దీనివలన మాతృభూమిపట్ల ప్రేమ పుడుతుంది. దీనివలన మాతృభూమి విషయంలో మనం కూడా అవసరమైనప్పుడు పరాక్రమం చూపాలనే భావం పుడుతుంది. అలా చేయటం ప్రాచీనులను అనుసరించటం అవుతుంది.

**"అజీతోऽహతో అధ్యష్ఠాం పృథివీ మకరమ్"** - అథర్వ 12.1.11

"అజేయుడై, యుద్ధంలో చావకుండా దెబ్బలతో వ్రణరహితుడై 'నేను నా మాతృభూమికి అధ్యక్షుడినై విరాజిల్లుతాను! ఇలా మాతృభూమికి అధ్యక్షుడనై మంచిపనులు చేస్తాను!' అనే ఆలోచన ప్రతి మానవుడు హృదయం - మనస్సులో ధారణ చేయాలి.

**"త్వజ్జాః త్వయి చరన్తి మర్త్యాః**
**తవేమే పృథివి పంచమానవాః ॥"** (అథర్వ 12.1.15)

'ఓ మాతృభూమీ! పంచవిధ మానవులమైన మేము నీ నుండే - నీయందే పుట్టినాము. నీ పైననే భ్రమణం చేస్తున్నాము" ఈ మంత్రంవలన మానవులలో సంగటన భావం సూచితమవుతుంది. ఒకే దేశంలో పుట్టిపెరిగి జీవించే వారందరూ సంఘీభావం కలిగి ఉండటం సహజం కాదా? అలాగే -

**"యే నో ద్వేషత్ పృథివి యః పృతన్యాత్ యోऽభి**
**దాసాత్ మనసా యో వధేన తం**
**నో భూమే రంధయ పూర్వకృత్వరి.** (అథర్వ 12.1.14)

ఓ పృథ్వీ! ఎవడు మమ్మల్ని ద్వేషిస్తాడో, ఎవడు సైన్యాన్ని చంపి మాతో యుద్ధం చేస్తాడో, ఎవడు మమ్మల్ని మనస్సుతో దాసులను చేస్తాడో ఓ మాతృభూమీ! వారిని నాశనం చేయుము.

"యస్యాం పూర్వే భూతకృత ఋషయో గా ఉదా నృచుః" - (అథర్వ 12.1.36)

"ఏ మాతృభూమిలో పూర్వసమయంలో భూతకాలపు చరిత్రను నిర్మించే గొప్ప ఋషులు ఉద్భవించారో" - ఇలా ప్రాచీన మహర్షుల విషయంలో ఉత్తమ రీతితో స్మరణ కలుగుతుంది.

## మాతృభూమి - వైదిక గీతం

ఏ దేశంలో మానవులు జన్మించి నివసిస్తారో ఆ దేశం వారి మాతృభూమి అనబడుతుంది. భారతీయులకు భారతభూమి, చైనీయులకు చైనా, ఆంగ్లేయులకు ఇంగ్లాండు మాతృభూములనబడతాయి. అన్యదేశీయులకు ఆయా దేశాలు మాతృభూములు అంటారు. తల్లియొక్క రక్తమాంసాలతో పిల్లలదేహం ఏర్పడుతుంది. అలాగే మాతృభూమిలో ఉత్పన్నమైన వారు ఆ దేశపు అన్నం, జలం, వాయువు, వనస్పతులతో పోషింపబడతారు. వారి శరీరాలు ఏర్పడతాయి. కాబట్టి ఆ దేశాన్ని వారు తమ మాతృభూమిగా చెప్పటం వారి కర్తవ్యం అవుతుంది.

తల్లిపాలపై బిడ్డలకు అధికారం ఉంటుంది. ఇది పరమేశ్వరుడి నియమం. తల్లి స్తనాలలో పరమేశ్వరుడు ఏర్పరిచిన పాలపై ఆ తల్లి సంతానానికే అధికారం ఉంది అనేదాన్ని ఎవరు కాదంటారు? మొదట తల్లిపాలతోనే సంతానం జీవిస్తుంది. తల్లిపాలు త్రాగటం పిల్లలకు జన్మసిద్ధమైన అధికారం. అది అతని ధర్మం కూడా. ఒక బాలుడు బలవంతుడై తన తల్లిపాలు త్రాగటమే కాక మరొక పిల్లవాని తల్లిపాలు కూడా త్రాగి ఆ రెండవ పిల్లవాని ఆకలి బాధకు గురిచేస్తాడనే ఆ బాలుడు చేసిన పని పరమేశ్వరుని నియమానికి విరుద్ధమవుతుంది. మరియు ఆ బలవంతుడైన బాలుడు పరమేశ్వరుని నియమాన్ని అనుసరించి అపరాధిగా ఎంచబడతాడు. అలాగే ఒక దేశపు సంతానమైన మానవుడు మరొక దేశపు మానవులను, సంతానాన్ని పరతంత్రులను చేస్తేడో, మరియు దేశపు భోగ్యపదార్థాలను ఆ దేశవాసులు అనుభవించకుండా చేసి తన సుఖానికే ఉపయోగించుకుంటాడో అతడు మిక్కిలి అపరాధి అవుతాడు. తల్లికి బిడ్డలకు గల స్థితి - సంబంధం ఎలాంటిదో అలాంటిదే మాతృదేశానికీ, ఆ దేశవాసులకు గల సంబంధం అనటం ఎన్నడూ మరవరాదు.

ఒక మానవుడు తాను ఉండే గృహం ఎంతగా ప్రేమిస్తాడో ఎలా తెలుసుకుంటారు? రాత్రి సమయంలో ఒకడు పరాయికని ఇంట ప్రవేశించి ఆ ఇంటివాని భోగ్యవస్తువులను హరిస్తే ప్రభుత్వం ఆ చోరుని పట్టుకొని దండిస్తుంది. తనతను పూర్వజుల నుండి లభించిన గృహవస్తువుల మీద ఆ ఇంటివారి అధికారాన్ని స్థిరపరచటం ప్రభుత్వ కర్తవ్యం. న్యాయం యొక్క ఉద్దేశం కూడా అదే. చోరునకు పరాయి వస్తువుపైన అధికారం ఉండదు. అందువలన అతడు దండనీయుడవుతాడు.

ఒక చిన్న ఇల్లు ఒక కుటుంబానికి చెందినదైనట్లు దేశం కూడా ఒక పెద్ద ఇల్లు. అది ఆ దేశవాసులకు అందరికీ చెందినదవుతుంది. ఆ దేశరూప గృహంపై ఇతర దేశవాసులు బలవంతులు కలిసి దాడిచేసి ఆ దేశసంపదపై అధికారం ఏర్పర్చుకోవటం ఒక ఇంటిపై బందిపోటు దొంగ అధికారం సంపాదించినట్లు ఘోర అపరాధమవుతుంది. ఇది సాధారణ బందిపోటు దొంగ చేసిన అపరాధం కంటే ఎంతో భయంకర అపరాధమనక తప్పదు. ప్రపంచంలో గల పెద్దపెద్ద తత్త్వజ్ఞులు ఇలాగే అంగీకరిస్తారు. కానీ ప్రపంచంలో రాజ్యకార్య భారం తత్త్వజ్ఞుల చేతులలో లేనందువలన బలవంతులు ఇలాంటి రాష్ట్రాల దోపిడులను అపరాధంగా భావించరు. మరియు ఇలాంటి గొప్ప అపరాధికి దండన లభించదు. కానీ ఈశ్వరుని నియమాలలో ఇలాంటి పక్షపాతం ఉండదు.

ఇలాంటి అపరాధులకు దండన లభిస్తుందా లేదా? అని విచారించటం మనకు ఇక్కడ ముఖ్యం కాదు. ఇక్కడ మేము చెప్పదలచినదేమిటంటే:- తల్లిపాలపై ఆమె బిడ్డలకు, ఒక ఇంటిపైన ఆ ఇంట్లో ఉండేవారికి, రాష్ట్రంపై ఆ రాష్ట్రవాసులకు, ఒక మాతృదేశంలో గల భోగ్యవస్తువులపై ఆ భూమి సంతానానికి మాత్రమే అధికారం ఉంటుందని తెలపడమే.

బిడ్డ తల్లిపాలు త్రాగుతాడు. అందువలన తల్లిపై అతనికి ప్రేమ కలుగుతుంది. మనుషులు తమ మాతృభూమిలో ఫలించే ధాన్యాలు, పండ్లు, కందమూలాలు, కాయగూరలు మొదలైన వాటిని తిని బ్రతుకుతారు. బలవంతులవుతారు. కాబట్టి వారికి మాతృభూమిపై ప్రేమ ఏర్పడుతుంది. కవులు మాతృభూమిని గురించి పాటలు గేయాలు రచిస్తారు. అలాగే జనులు తమ మాతృభూమిని గురించి గానం చేస్తారు. ఆ గానాలతో ఇతరులను ఉత్సాహపరుస్తారు.

తల్లిపై, మాతృభూమిపై వ్రాసిన గీతాలు, కావ్యగానాలు సంతానంలో నైసర్గిక ప్రేమను ఉద్భవింపచేస్తాయి. కావ్యంలో ఉండే అనేక రసాలలో ప్రేమరసం శ్రేష్ఠం. మాతృదేవతకు సంబంధించిన కావ్యంలో ఎలా ప్రేమరసం నిండి ఉందో అన్యకావ్యాలలో ఉండదు. తల్లి అంటే? ఆమె ఒక అసీమ ప్రేమమూర్తి. మాతృప్రేమకు ఉపమ మాతృప్రేమయే అవుతుంది. మరేదీ కాదు. మాతృదేవతను ప్రేమించని మానవుడు అరుదుగా ఉంటాడు. మాతృప్రేమ వల్లనే ప్రతి మానవుడు పాలించబడుతున్నాడు. మాతృభూమిపైనా మనుషులకు ప్రేమ ఉంటుంది. ఈ దేశ ప్రేమకు హద్దులుండవు. ఎలాంటి ఆపద, సంకటం సంభవించినా మాతృభూమిని విడువజాలడు. మాతను, మాతృభూమిని రక్షించటం కొరకు మనుషులు తన శరీరాన్ని కూడా బలిగా అర్పించటానికి సిద్ధమవుతారు.

ఇలాంటి అసీమ ప్రేమతో ప్రేరితులైన సర్వదేశవాసులే మాతృభూమికి సంబంధించిన గీతాలు మిక్కిలి భక్తిభావంతో రచిస్తారు. గానం చేస్తారు. కావ్యాలు రచింస్తారు. సర్వదేశాలలోనూ ఆనందోత్సవాలలో, విజయోత్సవాలలో తమ తమ రాష్ట్రగీతాలు గానం చేయటం ఒక పరిపాటి.

ఇలాంటి రాష్ట్రగీతం - మాతృభూమి గీతం భారతవాసులలో ఉన్నదా? లేదా? అనే విషయంలో విద్వాంసులలో మతభేదాలుండవచ్చు. భారతవాసులకు ఒక్క రాష్ట్రం అనేది ఎన్నడూ లేదు. కాబట్టి వారిలో రాష్ట్రగీతం ఉండటం అసంభవం అని కొందరు విద్వాంసులు అభిప్రాయపడుతున్నారు. మధ్యకాలంలో ఈ విశాల భారతదేశంలో అనేక చిన్న చిన్న రాజ్యాలేర్పడ్డాయి కాబట్టి ఆ కాలంలో ఒక రాష్ట్రీయ కల్పన కూడా లేదంటే అది సత్యం కావచ్చు. కానీ ఆ విద్వాంసుల మతం అన్ని విధాల నిరాధారం తర్కహీనమనక తప్పదు. ఎందుకంటే మన భారతీయులలో ప్రారంభం నుండే రాష్ట్రీయకల్పన ఉండనే ఉన్నది. అది ఋషుల కాలం నుండి నేటి వరకు వస్తూనే ఉంది. దీనికి నిదర్శనంగా రాష్ట్ర గీతం కూడా మన దగ్గర ఉన్నది. దానిని సమర్థించుటకే ఈ చిన్న పొత్తంలో మాతృభూమికి సంబంధించిన వైదిక సూక్తం గురించి వ్రాయబడుతున్నది. ఈ సూక్తం అథర్వ వేదంలో 12వ కాండంలో మొదటిది.

## ఈ సూక్తం యొక్క ఉపయోగం:

ఈ సూక్తప్రయోజనం - మహత్త్వం - రాష్ట్రీయమా కాదా? అనే విషయం దీని ఉపయోగం వలన తెలిసికొనగలము. కాబట్టి దీని ఉపయోగం ఎక్కడ? అంటే:-

(1) "గ్రామ పత్తనాది రక్షణార్థమ్" - అథర్వ 12.1.1 (సాయణభాష్యమ్)

'గ్రామాలను, నగరాలను రక్షించే సమయంలో వీటిని ఉపయోగించాలి' గ్రామాలను, పట్టణాలను, రాష్ట్రాలను రక్షించవలసి వచ్చినప్పుడు ఈ భూమాత గీతాన్ని - ఈ సూక్తం ఉపయోగించాలని భావం.'

స్వదేశ రక్షార్థమేదైనా కార్యమారంభించినప్పుడు ఈ సూక్తాన్ని ముందుగా పఠించాలి. దీనిని బట్టి స్వరాజ్య రక్షణకు ఈ సూక్తానికి నికట సంబంధమున్నదని బోధపడుతుంది. అన్నిదేశాలలో రాష్ట్రగానం రాష్ట్రరక్షార్థమే ఉపయోగించబడుతుంది.

**(2) "పార్థివీం భూమికామస్య" - (నక్షత్రకల్పన 17)**

"పృథ్విని కోరే వీరులు భూమియందు విశేషశాంతిని ఆపేక్షించినపుడు ఈ సూక్తం ఉపయోగించదగును'. దేశంలోనూ, రాష్ట్రంలోనూ అశాంతి ఏర్పడినప్పుడు దానిని దూరం చేయుటకు చేయబడే ప్రయత్నం "పార్థివీ మహాశాంతి" అనబడుతుంది. ఇలాంటి సమయంలో ఈ సూక్తాన్ని పఠించాలి. ఈ సూక్తాన్ని పఠించినందువలన మాతృభూమికి హితంచేసే వారిలో ఉత్సాహం కలుగుతుంది. ఇది నక్షత్రకల్పకర్త యొక్క అభిప్రాయం.

## మాతృభూమి కల్పన:

ఈ సూక్తంలోని మాతృభూమి కల్పన ఎలాంటిదంటే:- మన పూర్వజులలో మాతృభూమి కల్పన అనేది లేదనే వారు ఈ క్రింది వచనాలను బాగా ఆలోచించాలి. భారతీయులకు సంబంధించిన అతి ప్రాచీనమైన వైదిక సాహిత్యంలో మాతృభూమికి సంబంధించిన ఆలోచనలెన్నో ఉన్నాయి.

**"మాతా భూమిః పుత్రోఽహం పృథివ్యాః"** - (అథర్వ 12.1.12)

**"భూమి నా తల్లి; నేను భూమికి పుత్రుడను"** మనం నివసించే భూమి-దేశమే మన తల్లి-మాత. మనమందరం మన దేశమాత పుత్రులం. దేశవాసులమైన

మనమందరం ఒకే తల్లి బిడ్డలం. కాబట్టే మనమందరం నిజమైన దేశబంధువులం. ప్రతి దేశవాసి మనసులో ఈ భావం ఉండాలి. మాతృభూమి భక్తుల గౌరవ విషయంలో ఈ ఋగ్వేదమంత్రం చూడదగినది.

**"తే అజ్యేష్ఠాసో అకనిష్ఠాస ఉద్భిదోఽ**
**మధ్యమాసో మహసా వి వావృధుః.**
**సుజాతాసో జనుషా పృశ్ని మాతరో దివో**
**మర్త్యా ఆ నో అచ్ఛా జిగాతన".** ఋగ్వేద 5.51.6

**"అజ్యేష్ఠాసో అకనిష్ఠాస ఏతే సం భ్రాతరో వావృధుః సౌభగాయ."**
ఋగ్వేద 5.60.5

**అర్థం:** పృశ్నిమాతరః = దేశాన్ని తల్లిగా అంగీకరించు, మర్త్యాః = వారెల్లరు కులీనులు. వారిలో ఎవడూ. అజ్యేష్ఠః = జ్యేష్ఠుడు కాడు. ఎవడూ కనిష్ఠుడు కాడు. మధ్యముడు కాడు. వారందరూ సమానులు. ఉద్భిదః = వారందరూ తమపై వచ్చే ఆపదలను ఎదుర్కొని ఉద్యమించువారే. వారి ఆలోచన ఒక్కటిగానే ఉంటుంది. అంటే వారు, భ్రాతరః = బంధువులు. సౌభాగాయ = తమ ధనాన్ని వృద్ధిచేయుటకు, సంవావృధుః = వారందరూ కలిసి ప్రయత్నిస్తారు.

ఈ మంత్రంలో (పృశ్నిమాతరః) భూమిని మాతగా – తల్లిగా ఎంచే సజ్జనుల వర్ణన గమనించదగినది. మాతృభూమి భక్తులు ఒకే ఆలోచన గలవారగుదురు. వారిలో ఉచ్చనీచ భావాలు ఉండవు. వారి 'దర్జా' ఒక్కటే, వారెల్లరూ ఒకే భావంతో మాతృభూమిని ఉద్ధరించుటకు పాటుపడతారు. వారిలో బంధుభావం ఉండదు. తమ ఉన్నతిని కోరుతారు. దేశాన్ని తల్లిగా ఆచరించేవారి ఆచరణలో కలిగే సమానత ఈ మంత్రంలో స్పష్టపరచబడింది. మాతృభూమిని తమ వ్యవహారానికి కేంద్రంగా ఎంచేవారిలోనూ, ఎంచనివారిలోనూ భేదముంటుంది. వేదాలలో ఈ విషయం మిక్కిలి స్పష్టపరచబడింది. దీనివలన దేశాన్ని మాతృభావంతో చూసేవారిలో దేశం భక్తి పెరుగుతుంది.

**"ఇళా సరస్వతీ మహీ తిస్రో దేవీర్మయోభువః. బర్హిః సదిన్త్వ స్రిధః."**
– ఋ. 1.13.6

"మహీ = మాతృభూమి. సరస్వతీ = మాతృసంస్కృతి. ఇళా = మాతృభాషా. ఈ మూడును సుఖాన్ని ఇచ్చే దేవతలు (మయోభువః) ఈ మంత్రంలో వర్ణించబడిన మూడు దేవతలలో మాతృభూమి కూడా ఒకటి. పై ఋగ్వేదమంత్రాలలో మాతృభూమి మహిమ వర్ణించబడటం సుస్పష్టం. ఈ మంత్రార్థాలను గురించి ఆలోచించిన మీదట మన ధర్మగ్రంథాలలో మాతృభూమి మహత్త్వం, శ్రేష్ఠత ఎంతగా వర్ణించబడిందో తెలుస్తున్నది. ఈ విషయంలో ముందుగా ఈ మంత్రం చూడదగినది:-

**"భూమే మాతర్నిదేహి మా భద్రయా సుప్రతిష్ఠితమ్".** - (అథ 12.1.63)

"మాతః భూమే! = ఓ మాతృభూమీ! నన్ను కల్యాణమయ అవస్థలో ఉంచుము" అనగా ఓ మాతృభూమీ! నాకు సమస్త కల్యాణములను - శుభాలను కలిగించుము. ఈ మంత్రంలోని "భూమే! మాతః!" మొదలైన పదాలవలన మాతృభూమి యొక్క యోగ్యత తెలుస్తున్నది. ఇలాగే -

**"సా నో భూమిః పూర్వపేయే దధాత" (3)**

**"సా నో భూమిర్గోష్వప్యన్నే దధాతు". (4)**

**"సా నో భూమిర్ భూరి ధారా పయోదుహా". (6)**

**"సా నో భూమి ర్వర్ధయ ద్వర్ధమానా". (13)**

**"సా నో భూమి రాదిశతు యద్ధనం కామయామహే" (40)**

**"సా నో భూమిః ప్రణుదతాం సత్పనా న సపత్నం మా పృథివీ కృణోతు"**

**(41)** (అథర్వ 12.1)

"ఆ మా మాతృభూమి మాకు అపూర్వమైన పేయపదార్థాలను ఇచ్చుగాక! గోవులను, అన్నాన్ని మిక్కిలి దుగ్ధమును ఇచ్చునుగాక! మమ్ముల వర్ధిల్లచేయు గాక! మాకు కామితార్థాలను ఇచ్చి, శత్రువులను దూరంచేసి మమ్మల్ని శత్రు రహితులను చేయుగాక" ఇవి పై మంత్ర వాక్యాల భావం.

పూర్వ సంబంధాన్ని మనసులో ఉంచుకొంటే ఈ మంత్రాలలోని భూమిశబ్దం మాతృభూమి అనే అర్థాన్నే భోదిస్తుంది. మాతృభూమి మనకు 'అది ఇస్తుంది- ఇది ఇస్తుం'దని అనటం కావ్యమయాలంకారంగా గ్రహిస్తారు. వాస్తవంగా దీని

అర్థమిది. మాతృభూమి కృపవలన మాకు ఈ కార్యాలగు గాక! ఆ కార్యాలగుగాక! వానికి తగిన ఫలం లభించుగాక! అని చెప్పుకోవాలి. ప్రతికావ్యంలోనూ ఇలాంటి ఆలంకారిక వర్ణనలుంటాయి. ఈ ప్రార్థనల అర్థం భిన్నంగా ఉంటాయి. శబ్దాలలోని భావాలు భిన్నంగా ఉంటాయి. ఈ విషయంలో ఈ మంత్రం మననం చేయదగినది.

**"సా నో భూమిర్ విస్సృజతాం మాతా పుత్రాయ మే పయః "**

– అథర్వ. 12.1.10

"ఆ మా మాతృభూమి తన పుత్రుడనైన నాకు పాలను ఇచ్చుగాక!" ఈ మంత్రంలో ఎంత అలంకారముందో చూడండి! మాతా పుత్రుల సంబంధం దుగ్ధపానంతోనే ప్రారంభమవుతుంది. పుత్రుడు – పుత్రిక తల్లిపాలు త్రాగుతారు. ఇది అందరికీ తెలిసినదే. మనమందరం తల్లిపాలు త్రాగుతాము. భూమి నుండి లభించే ధాన్యాలు, రసమయ పదార్థాలు, దుగ్ధము, నీరు మొదలైనవన్నీ మనవే అవుతాయి. అందువల్లనే ఈ భూమి మాతృదేవత. ఇది సర్వసామాన్య వ్యవహారాలలో – నా తల్లి నాకు ఈ దుగ్ధము ఇవ్వాలి" ఈ మాతృభూమిలో ఉత్పన్న పదార్థాలు మాకే చెందాలి. ఇతరులు ఎవరూ వాటిని హరించరాదు అనే ఇలాంటి వర్ణనలు మిక్కిలి సద్బోధకాలు. కాబట్టి ఇవి స్వీకరించదగినవని వేరుగా చెప్పనక్కరలేదు.

## అధ్యాత్మ జ్ఞానము, రాష్ట్రభక్తి:

మనలో కొందరికి ధార్మిక విషయాల పట్ల మిక్కిలి దుర్భావన ఉన్నది. ఈ విషయం అనేక దృష్టాంతాల ద్వారా స్పష్టమవుతుంది. అధ్యాత్మ జ్ఞానానికి రాష్ట్రభక్తికి మధ్య సంబంధం ఉన్నది. ఈ సత్యం చాలామందికి తెలియదు. అధ్యాత్మ విచారంగల వ్యక్తి – వేదాంత సర్వప్రపంచాన్ని విడిచి ఎక్కడో ఒక గుహలో కూర్చోవటానికి ప్రయత్నిస్తారు.

అలాంటి వారిని చూసి రాష్ట్రభక్తులు, ఇతరులు ధర్మానికి రాజ్యానికి ఎలాంటి సంబంధం ఉండదంటారు. ఈ విరోధభావాన్ని గుర్తించి ఆధ్యాత్మ విద్యకు, రాష్ట్రభక్తికి రెండింటికీ మధ్య చాలా సంబంధం ఉన్నదని ఇది సత్యం అని ఈ విషయాన్ని సిద్ధపరచటానికి ఇతిహాసానికి సంబంధించిన ఒకటి రెండు ఉదాహరణలు ఇస్తున్నాము.

1) అర్జునుడు యుద్ధభూమిలో ప్రవేశించాడు. శత్రువులను జయించాలనే మహత్త్వాకాంక్ష గలవాడై యుద్ధానికి సిద్ధపడ్డాడు. కానీ యుద్ధం ప్రారంభించటానికి ముందే అతడు మోహగ్రస్తుడయ్యాడు. అరణ్యంలో తపస్సు చేయటానికి సిద్ధపడ్డాడు. 'యుద్ధం చేసి రాజ్యం సంపాదించటం కంటే అరణ్యంలో తపస్సు చేసి ఉత్తమావస్థను సంపాదించటం మిక్కిలి మంచిది' అని అతడు తలచాడు. అప్పుడు కృష్ణుడు అతనికి వైదిక ఆధ్యాత్మిక విద్యను ఉపదేశించివాడు. కృష్ణుని ఉపదేశాన్ని విన్న తర్వాత అర్జునుని మోహం తొలిగింది. అతనికి ఆవశ్యకమైన జ్ఞానం లభించింది. అతడు యుద్ధం చేసి నిష్కంటక రాజ్యాన్ని స్థాపించాడు.

రెండవ ఉదాహరణ:-శ్రీరాముని విద్యాభ్యాసం పూర్తియైన పిదప అతనికి "సమస్తం దైవాధీనం, పురుషార్థం వలన ఏమీ సిద్ధించదు" అనే భ్రమ కలిగింది. అందువలన అతడు పురుషార్థం నుండి విముఖుడయ్యాడు. అప్పుడు వసిష్ఠ మహర్షి అతనికి వేదాంతశాస్త్రాన్ని, ఆధ్యాత్మిక శాస్త్రాన్ని ఉపదేశించాడు. ఆ ఉపదేశం వలన రామచంద్రుని భ్రమ దూరమయ్యింది. తర్వాత మిక్కిలి పురుషార్థియై రావణాది రాక్షసులను సంహరించి లంకను జయించాడు.

ఈ ఉదాహరణల వలన "ఆధ్యాత్మిక జ్ఞానం ద్వారా ప్రబల పురుషార్థం చేసి స్వరాష్ట్రానికి శత్రువులైన వారిని పూర్ణంగా నశింపచేసి రాష్ట్రీయ స్వతంత్రతను సంపాదించా"లని తెలుస్తున్నది.

### అధ్యాత్మజ్ఞానము:

బుద్ధి, మనస్సు, చిత్తం, అహంకారం, ప్రాణాలు, ఇంద్రియాలు అనేవి అన్నీ శరీరాంగాలు. వీనికి ఆధారం ఆత్మ. ఇవన్నీ గొప్ప శక్తులు. ఈ శక్తుల జ్ఞానాన్నే ఆధ్యాత్మజ్ఞానమంటారు.

ఈ శక్తులన్నీ మనలో ఉన్నాయి. కాబట్టి మనం పనికిరాని వారం కాము. మన ఆధీనంలో ఉన్న శక్తులను నడిపించవలసిన వారం మనమే. మన ఈ శక్తి ఆధ్యాత్మజ్ఞానం వలన కలుగుతుంది. ఆధ్యాత్మజ్ఞానసంపాదనకు పూర్వం మానవుడు తనను క్షుద్రుడనీ నిర్బలుడనీ భావించాడు. జ్ఞానప్రాప్తి కలిగిన తర్వాత తనను తాను సబలుడనని, సమర్థుడనని భావించాడు.

**బ్రహ్మజ్ఞానము:**

విశ్వవ్యాపీ, సచ్చిదానంద స్వరూపుడైన ఈశ్వరుని అస్తిత్వం చరాచరంలో అంతటా ఒక్కటిగా ఉంటుంది. ఇలాంటి జ్ఞానంతో ప్రపంచాన్ని చూసినప్పుడు దృష్టిలో మార్పు ఏర్పడుతుంది.

ఇలాంటి వారికి ఆంతరిక జగత్తు శక్తుల జ్ఞానం కలుగుతుంది. కాబట్టి అతనికి ధర్మకార్యం చేసినప్పుడు శోకమోహాలు ఏర్పడవు. సాధువులను రక్షిస్తాడు, దుష్టులను శిక్షిస్తాడు. అతడు ధర్మాన్ని రక్షిస్తూ లోకులలో శాంతిని నెలకొల్పుతాడు. అతనితో జగద్దృష్టి ఉన్నతమవుతుంది. అతనికి స్త్రీ, సంతానాలలో మోహం ఏర్పడదు. గృహాది సంపదలలో లోభం ఏర్పడదు. ఐశ్వర్యాలను పొంది అలసిపోయి తన కర్తవ్యాన్ని విడవడు.

ఇదియే గాక ఈ జ్ఞానం వలన మరొక లాభం కలుగుతుంది. భూమిపై స్వార్థంవలన కలిగే యుద్ధాలు ఆగిపోతాయి. సజ్జనులకు కష్టాలు సంభవించవు. బ్రహ్మజ్ఞానం వలన మానవుని దృష్టి పవిత్రమవుతుంది. తన స్వార్థంకొరకు ఇతరులను పరతంత్రులను చేయడు. బాధించడు. లోకంలో సజ్జనుల దుఃఖాన్ని పోగొట్టడానికే అతని ఖడ్గం ఒరనుండి బయటికి తీయబడుతుంది. కాబట్టి నేడు ఈ దేశంలో స్వార్థసంకుచిత బుద్ధితో జరిగే కలహాలు పరస్పర దురాక్రమణలు, నిష్కారణ హత్యలు మొదలగునవన్నీ బ్రహ్మజ్ఞానం, ఆధ్యాత్మజ్ఞానం వలన తొలగించే వీలుంది. రాష్ట్రానికి సంబంధించి క్షాత్రశక్తి చాలా గొప్పది. ఆ శక్తిని బ్రహ్మజ్ఞానియే బాగా సంబాళింపగలడు. బ్రహ్మజ్ఞానహీనులు, స్వార్థులు, లోభులు ఈ రాష్ట్ర క్షాత్రశక్తిని దురుపయోగం చేసి లోకంలో పాపపు సామ్రాజ్యాన్ని వ్యాపింపచేస్తారు.

కాబట్టి మొదట బ్రహ్మజ్ఞానాన్ని సంపాదించి తన దృష్టిని విశాలం, ఉన్నతం చేసుకోవాలి. తర్వాత రాష్ట్రీయ క్షాత్రశక్తిని ఉపయోగించుకోవాలి. ఇదే వేదాల ఆజ్ఞ. ఇదే వేదాల దూరదర్శిత. ఈ విషయాన్నే వేదం జగత్తుకు బోధించింది.

ఇప్పుడు రాష్ట్రగీతానికి సంబంధించిన మంత్రాలలో ఏయే మంత్రం ఏ మహత్వాన్ని బోధించునో చూడండి.

"సత్యం బృహదృతముగ్రం దీక్షా తపో బ్రహ్మ యజ్ఞః పృథివీం ధారయన్తి."

"సా నో భూతస్య భవ్యస్య పత్న్యురుం లోకం పృథివీ నః కృణోతు".

(అథర్వ 12.1.1)

'సత్యం, సరలత, ఉగ్రత, ఉదారత, తపస్సు, జ్ఞానం, యశస్సు మొదలైన గుణాలు మాతృభూమిని ధరిస్తుంది. మన భూత, భవిష్యద్వర్తమానాల స్థితిని పాలించే ఆ మన మాతృభూమి మనకు కార్యాలను చేయుటకు విస్తృతస్థానాన్నిస్తుంది.

ఈ మంత్రంయొక్క పూర్వార్ధంలో మాతృభూమిని ఎవరెవరు ధారణ చేయగలరో వర్ణింపబడింది. ఇది అందరూ గుర్తింపదగిన విషయం.

మానవులందరూ తమ మాతృభూమిని ధరించలేరు; పోషించలేరు. విశేషగుణాలు కలవారే రాష్ట్రాన్ని ఉన్నతం చేయగలరు. ఇతరులు సంఖ్యను వృద్ధిచేయడానికే కారణమవుతారు. ఈ విషయం ఈ ప్రథమ మంత్రంలో స్పష్టమవుతున్నది.

**'సత్యం'** రాష్ట్రీయ గుణాలలో ప్రథమం. సత్యప్రియులు సత్యాన్ని పాలించటంలో - తన సర్వం సమర్పించి రాష్ట్రాన్ని ఉద్ధరించగలరు. వారే సత్యాగ్రహులు - సత్యాన్ని పట్టుదలతో పాలిస్తారు. వారే స్వరాష్ట్రాన్ని ఉద్ధరిస్తారు. ఈ సూక్తప్రారంభమే సత్యశబ్దంతో జరిగింది. సూక్తారంభక శబ్దం సత్యం మంగళార్థకం. అన్నిటికంటే మిక్కిలి మహత్త్వపూర్ణమైనది. కాబట్టి వైదిక రాష్ట్రీయతలో సత్యమత్యంత గొప్పనైనది. సత్యం వ్యక్తిగత సత్యం, సామాజిక సత్యం రాష్ట్రీయ సత్యం అని మూడురకాలుగా విభజింపబడింది.

భారతవాసి వ్యక్తిగత సత్యాన్ని పాలించటంలో ఇతర దేశవాసులతో పోల్చినప్పుడు అధిక తత్పరుడు. దక్షుడుగా సిద్ధమవుతుంది; కాని అతడు సామాజిక సత్యాన్ని, రాష్ట్రీయ సాముదాయిక సత్యాన్ని పాలించటంలో దక్షుడుకాడు. సాముదాయిక సత్యాన్ని పాటించటం వల్లనే సత్యాగ్రహమార్గం సఫలమవుతుంది. భారతీయులు సాముదాయిక సత్యమేమో, దానిని ఎట్లా పాలించాలో తెలుసుకొని దానిని ఉచిత రీతిని పాలిస్తే వారికి మిక్కిలి శుభం కలుగుతుంది.

సత్యానంతర గుణం **'ఋతం'**. అనగా సరలత. అదీ సత్యంవలే మహత్త్వపూర్ణ గుణం. సత్యపాలనానంతరం ఇది పాలించబడుతుంది. సత్యపాలన చేయనివారు, ఆచరణలో సరలతలేనివారు ఉన్నతిని పొందజాలరు. వారు అవనతులవటమే కాక తోటివారిని కూడా గుంతలో పడవేస్తారు.

**'ఉగ్రత'** ఇది వీరులలోను, శూరులలోను ఉండే గుణం. ఈ గుణంగల క్షత్రియులే రాష్ట్రాన్ని సత్యాగ్రహ పథంలో నడపగలరు.

**'దక్షత'** తర్వాతి గుణం. అది దాక్షిణ్యాన్ని తెలుపుతుంది. ప్రతికార్యం నిర్వహించటానికి ఆవశ్యకమైన గుణం. దక్షతలేని వ్యక్తి ఏ కార్యంలోనూ సఫలత పొందజాలడు.

**తపస్సు:** ఈ గుణం – రాష్ట్రీయ మహత్త్వానికి సంబంధించినది. శీతోష్ణాలు, హానిలాభాలు, సుఖదుఃఖాలు మొదలైన ద్వంద్వాలు–జంటలు. కష్టాలు సంభవించినప్పుడు వాటిని సహిస్తూ రాష్ట్రకార్యాలను నిర్వర్తించటంలో వెనుకాడక ముందంజ వేయటం తపస్సనబడుతుంది.

తర్వాత రాష్ట్రీయ గుణం **'బ్రహ్మ'** జ్ఞానం. **'జ్ఞానాన్మోక్షః'** జ్ఞానంవలన మోక్షం కలుగునని ఒక సూత్రకారుని మతం.

జ్ఞానం వలన ఒక వ్యక్తి దుఃఖముక్తుడై ఆనందాననుభవించునట్లు రాష్ట్రం కూడా జ్ఞానం వలన పరాధీనత నుండి ముక్తమై 'స్వతంత్రతను అనుభవిస్తుంది'.

ఆ తర్వాతి గుణం **'యజ్ఞం'**. యజ్ఞం వలన ఆత్మసమర్పణ భావం ప్రకటమవుతుంది. రాష్ట్రోన్నతి కొరకు లోకులు ఆత్మసమర్పణ చేయటానికి సిద్ధం కావాలి. అప్పుడే రాష్ట్రోన్నతి సంభవమవుతుంది.

వైదిక రాష్ట్ర గీత ప్రథమమంత్రం మనకు మహత్త్వ పూర్ణ ఉపదేశం ఇస్తున్నది. ఏ గుణాలను ప్రజలు వృద్ధిచేసుకోవటం వలన రాష్ట్రం ఉన్నతమవుతుందో, ఏ గుణాలు ప్రజలలో లేనందున రాష్ట్రపతనం ఏర్పడుతుందో ఈ మంత్రంలో స్పష్టం చేయబడినది.

ఈ మంత్రపు పూర్వార్ధంలో రాష్ట్రోన్నతికి తగిన గుణాలను ఉపదేశించి, ఉత్తరార్ధంలో ఏ గుణాలవలన రాష్ట్రావనతి కలుగునో బోధింపబడుతున్నది. మంత్రంలో ముందు రాష్ట్రధారణ గుణాలు, తర్వాత "మన మాతృభూమి మన భూతభవిష్యద్వర్తమానకాలాల పరిస్థితికి సంబంధించిన గుణాలు వర్ణింపబడినది.

రాష్ట్రభక్తులు మాతృభూమిని ఉపాసిస్తారు. వారి కార్యాలన్నీ మాతృభూమి ఉద్దేశాల కేంద్రంగా జరుగుతాయి. కాబట్టి రాష్ట్రభక్తుల త్రికాల నియామక దేవత

మాతృభూమియే అని స్పష్టమవుతుంది. వారు భూతకాలంలో మాతృభూమిని ఎట్లా సేవించారో, వర్తమాన భవిష్యత్ కాలాలలో కూడా అలాగే సేవిస్తారు. తమ అవనతికి కారతభూతమైన కార్యం ఎన్నడూ చేయరు.

రాష్ట్రం దేశవాసుల కర్తవ్యక్షేత్రం కావాలని, పరదేశీయుల కార్యక్షేత్రం కాకూడదని భావం.

**ఏకత:** రాష్ట్ర ఉన్నతి కొరకు దేశభక్తులలో ఏకత తప్పక ఉండాలి. ఏకత లేకుంటే సాముదాయిక కార్యసిద్ధి అసంభవమవుతుంది. ఇది అందరికీ తెలిసినదే. కానీ ఏకత ఎలా సిద్ధిస్తుందో వారికి తెలియదు.

ఈ రాష్ట్రీయ ఏకత మనదేశంలో ఎలా సంభవించును? మనదేశంలో భిన్న భిన్న సంప్రదాయాలు చాలా ఉన్నాయి. వివిధభాషలు, అనేక విధాలైన కులాలు వేరు వేరు ఆచారాలు, ఇలాంటి స్థితిలో ఏకత ఎలా కలుగుతుందని అందరూ సందేహిస్తారు. నిరుత్సాహితులవటం నైజం. ఏకత కొరకు కొందరెంత ప్రయత్నించినా భేదభావాలు పెంపుచెందుతూ ఉండటం చూస్తున్నాము. అందువలన రాష్ట్రభక్తులు **'గాబరా'** పడుతుంటారు. ఇలాంటి సమయంలో నిమ్నలిఖిత రాష్ట్రగీతపు మంత్రం ఒకటి బోధప్రదమని తోస్తున్నది.

**"జనం బిభ్రతీ బహుధా వివాచసం నానాధర్మాణం**
**పృథివీ యథౌకసమ్, సహస్రంధారా ద్రవిణస్య**
**మే దుమాం ధ్రువేవ ధేను రనపస్ఫురన్తీ"** - (అథర్వ 12.1.45)

"వివాచనం = అనేక భాషలు భాషించేది. నానాధర్మాణం = నానాధర్మయుక్త జనులుకలది. యథాఓకసం = ఒకే గృహంతో సమానంగా ధారణ చేసేది అయిన మాతృభూమి ధనంయొక్క సహస్రధారలను స్థిరంగా నిలబడి దుగ్ధధారలను పిండు గోవులాగా నాకు ప్రసాదించుగాక!"

వివిధ భాషలు మాట్లాడువారు, వివిధ సంప్రదాయాలను అనుసరించేవారు, వివిధాచారాలు గల వారు ఒక దేశంలో ఉన్నప్పుడు వారందరూ ఒక కుటుంబ వాసులుగా ఉన్న రోజే రాష్ట్ర ప్రగతి సిద్ధించగలదని పై మంత్రాభిప్రాయం.

అనేక దేశాలలో అనేక భాషాభాషలు, అనేక సంప్రదాయకులు, భిన్న భిన్న ఆచారాలు కలిగి ఉంటారు. కానీ వారందరూ స్వార్థాన్ని విడిచి రాష్ట్రహితం కోరినప్పుడే రాష్ట్రం అభివృద్ధి చెందుతుంది. రాష్ట్రప్రగతే వారి లక్ష్యమవుతుంది.

భారతదేశంలో మహమ్మదీయులు - క్రైస్తవులు, వైదికులు (హిందువులు) అనబడే భిన్న భిన్న మతాలను పాటించేవారున్నారు. ఈ మతాలన్నీ నశించి వీరందరూ ఒకే ధర్మాన్ని అవలంభించటం అసంభవం. ఒకవేళ ఎవడేని ఇది యత్నసాధ్యమంటే ఎన్ని యుగాలు పట్టునో ఎవరూ చెప్పలేరు. కాబట్టి భారతదేశ వాసులందరూ తమ మత, కుల, ఆచారాలను తమతమ గృహసమాజాలలో పాటిస్తూ రాష్ట్రప్రగతి కొరకు పాటుపడాలి. ఇదే పై మంత్రం యొక్క అభిప్రాయం.

పం.గోపదేవశాస్త్రి, దర్శనాచార్య

శుభమస్తు

# దేశభక్తి గేయాలు

-విద్వత్కవి పల్లా రామకోటార్య

విశ్వమంతటను-ఆర్యసమాజము-వేదసుధను-వెదజల్లునురా
భారతదేశపు పతనావస్థను-బాపి స్వర్గమును జేయునురా ॥విశ్వ॥
కార్యరంగమున కెక్కినచో తన-కాలును వెనుకకు వేయదురా
ఎన్నికష్టములు వచ్చినగానీ-అన్నిటి తల ధరియించునురా ॥విశ్వ॥
సోమరితనమును బాపి సుజీవన-జ్యోతి నట్టె వెలిగించునురా
ధర్మరక్షకైతను మన ధనముల-ధారవోయుటలు నేర్పునురా ॥విశ్వ॥
పరమ ధర్మమను ధ్వజమును జేకొని-పాపములెల్లను మాపునురా
మతోన్మాద పాఖండుల మానము-మంటగలుపుటకు జంకదురా ॥విశ్వ॥
ముదముగ ఈశ్వర బోధల దెలుపుచు- మూఢనమ్మకము లుడుపునురా
విధిగ నవిద్యాతమస మడంచియు-విద్యాకాంతిని విరియునురా ॥విశ్వ॥
వైదిక సందేశంబుల నిచ్చియు- వర్ణాశ్రమముల నిలుపునురా
స్త్రీలకు విద్యాబుద్ధులు గఱపియు-శిష్టమార్గమును జూపునురా ॥విశ్వ॥
ఎల్లప్పుడు సుఖశాంతి వర్షముల-నిలపై విడువక గురియునురా
భేదభావముల నిర్మూలించియు-ప్రేమతత్వమును బెంచునురా ॥విశ్వ॥
పతితమానవుల ధర్మభ్రష్టుల- భద్రమార్గమున జేర్చునురా
యవన హూణమత జాలమునన్ బడు - నట్టివారి రక్షించునురా ॥విశ్వ॥
ప్రజలకెల్లరకు ప్రాణప్రదమగు-పశుహింసల నిరసించునురా
విధవల దుఃఖానలమున మ్రగ్గెడి-విశ్వము జూడగ నొల్లదురా ॥విశ్వ॥
ఆశ్రయహీన అనాథల గని; తన-యంకంబున నిడి సాకునురా
శిష్టమార్గమును జూపుచు సున్నిత-శిఖరారోహణ జేయునురా ॥విశ్వ॥
పూజ్యఋషుల గౌరవకాంతుల నీ- పుడమియందు విరజిమ్మునురా
శాంతి మూలమగు వైదిక ధర్మపు-సత్ప్రచారమును జేయునురా ॥విశ్వ॥

# ఎదురులేని వీరుడు అదురు లేని శూరుడు

-ఆర్యకవి ప్రణవకుమార

ఎదురులేని వీరుడు
అదురు లేని శూరుడు
మా స్వామి దయానందుడు ఆ.... ||ఎదురు||

వివిధ సత్య విద్యల వేదాల రక్షకై
వీరకంకణం గట్టిన వీరయోధుడూ
ధీరుడూ-శూరుడూ-అంబుధీ కన్న గంభీరుడు
ఏ వంక లేని చంద్రుడూ యోగీంద్రుడూ ||ఎదురు||

వేదమాత కనుల నీరు తుడిచి వేయగా
వేద జనని బంధములను త్రెంచి వేయగా
మళ్ళీ యీ-లోకాన్నీ-మంచి మార్గాన నడపింపగా
తన బ్రతుకు ధారవోసిన ధన్యజీవుడు ||ఎదురు||

లోకమంత ఏకమైన జంకు చెందెనా !
తా నొంటి వాడ ననుకొని వెనుకంజ వేసెనా!
రాళ్ళతో-రువ్వినా-మేను గాయాలతో నిండినా
తన సత్యదీక్ష విడువనీ త్యాగ శీలుడు ||ఎదురు||

పాలలోన విషం కలిపి చంప నెంచినా ! ఆ
పరమ కిరాతకుని తాను ఏవగించెనా !
బాధతో-బడలినా!-తాను మరణమ్ము పాలయ్యినా !
అభయహస్త మిచ్చి వానినీ ఆదుకొనియెను ||ఎదురు||

అతని బాటలోన లోకులంత నడచినా !
అతని అడుగు జాడలోన మనము వెడలినా !
విందురా -విందురా-ఈ జగమే కనుల విందురా
ఆనందమే చిందురా! ప్రణవ కుమారా ! ||ఎదురు||

-0-

# ఉద్భవించినావ! ఉర్విజనుల బ్రోవ !

-విద్వత్కవి పల్లా రామకోటార్య

ఉద్భవించినావ! ఉర్విజనుల బ్రోవ !
దయా పూర్ణభావా దయానంద దేవా!

భారతీయ సంతతి యంతా-పరపాలన మ్రగ్గెడినాడు ।
భావదాస్య సాగరమందు-పడి పారము తెలియనినాడు ॥
జ్ఞానజ్యోతి చేకొని నీవ-జ్ఞానతమము బాపుటకొరకై ॥ఉ॥

మహిత వేదధర్మము పేర-మతములెన్నొ ప్రబలిననాడు ।
ఒక్క దేవు డుండేచోట-పెక్కుమూర్తు లలమిననాడు ।
జ్ఞానజ్యోతి చేకొని నీవ-జ్ఞానతమము బాపుట కొరకై ॥ ॥ఉ॥

అంటరాని తనమను పేర-కంటగింపు బలిసినవాడు ।
హేయమైన కులభేదాలు-హెచ్చి కుమ్ములాడెడినాడు
జ్ఞానజ్యోతి చేకొని నీవ-జ్ఞాన తమము బాపుటకొరకై ॥ఉ॥

స్త్రీలు చదువ దోషంబనుచు- స్వేచ్ఛనే హరియించినవాడు
ధర్మచ్యుతుల బైటికిగెంటి-తలుపులన్ని మూసినవాడు
జ్ఞానజ్యోతి చేకొని నీవ-జ్ఞానతమము బాపుట కొరకై ॥ఉ॥

యాగమందు స్వర్గాపేక్ష-మూగ పశుల బలిగొనునాడు
వేదములను బాహాటముగా-విమతులెల్ల నిరసించినవాడు
జ్ఞానజ్యోతి చేకొని నీవ-జ్ఞానతమము బాపుట కొరకై ॥ఉ॥

జీవితులకు కూడే యిడక-చావ శ్రాద్ధముల పెట్టేనాడు
ఫలితము జ్యోతిషంబును నమ్మి-పనికిమాలి తిరిగేనాడు
జ్ఞానజ్యోతి చేకొని నీవ-జ్ఞాన తమము బాపుట కొరకై ॥ఉ॥

-0-

# ఎదురులేని వీరుడు అదురు లేని శూరుడు

-ఆర్షకవి ప్రణమకుమార

ఎదురు లేనివీరుడు అదరులేని శూరుడు
మా స్వామి దయానందుదు ఆ.... ॥ఎదురు॥

వివిధ సత్య విద్యల వేదాల రక్షకై
వీర కంకణం గట్టిన వీర యోధుడూ
ధీరుడూ-శూరుడూ-అంబుధీ కన్న గంభీరుడు
ఏ వంక లేని చంద్రుడూ యోగీంద్రుడూ ॥ఎదురు॥

వేదమాత కనుల నీరు తుడిచి వేయగా
వేద జనని బంధములను త్రెంచి వేయగా
మళ్ళి యీ-లోకాన్నీ-మంచి మార్గాన నడపింపగా
తన బ్రతుకు ధారవోసిన ధన్యజీవుడు ॥ఎదురు॥

లోకమంత ఏకమైన జంకు చెందెనా !
తా నొంటి వాడ ననుకొని వెనుకంజ వేసెనా!
రాళ్ళతో-రువ్వినా-మేను గాయాలతో నిండినా
తన సత్యదీక్ష విడువనీ త్యాగ శీలుదు ॥ఎదురు॥

పాలలోన విషం కలిపి చంప నెంచినా ! ఆ
పరమ కిరాతకుని తాను ఏవగించెనా !
బాధతో-బడలినా!-తాను మరణమ్ము పాలయ్యినా !
అభయహస్త మిచ్చి వానినీ ఆదుకొనియెను ॥ఎదురు॥

అతని బాటలోన లోకులంత నడచినా !
అతని అడుగు జాడలోన మనము వెడలినా !
విందురా -విందురా-ఈ జగమే కనుల విందురా
ఆనందమే చిందురా! ప్రణవ కుమారా ! ॥ఎదురు॥

-0-

# జయము జయము భారత జననీ !

-ఆర్షకవి ప్రణవకుమార

జయము జయము భారత జననీ !
జయము పరమ పావనీ ! ||జయము పరమ||
జయము భవానీ ! జయమూ జయము భవానీ ! ||జయము||
భవ్యాతి భవ్యమైన వేదములు జనించె నీ యందే
దివ్యాతి దివ్యులైన మహర్షులు పుట్టిరి నీలోనే !
బంగారు తల్లివమ్మా ! రత్న గర్భ వీవమ్మా ! ||రత్న||
ఆర్యావనీ ! అమృతమయ రూపిణీ ! ||జయము||
గంగ యమునా గోదావరులూ తుంగభద్రాది జీవనదులు
పొంగి ప్రవహించే ఓ సుజలా ! పైడి పంటల నిచ్చే సుఫలా !
దుర్భిక్ష దూరిణి వమ్మా! సకల శుభ ప్రదవమ్మా !
సస్యశాలినీ! సర్వ సౌఖ్యదాయినీ ||జయము||
పృథివిలో గల మానవులంతా ఒకప్పుడు నీ పదముల చెంత
కూర్చొనీ నీ శిక్షణ చేతే సుశిక్షుతులైరీ వారంతా !
జ్ఞాన గంగ ప్రవహించినది దేశ దేశములలోకి ||దేశ||
నీ నుండియే ఎవరంటారు కాదని ||జయము||
స్వార్థ సంకుచిత భావములకు తావు నీయని వాలర మమ్మా !
సమతనూ మమతను పంచుకొని సాగు నీ సంతతి మేమమ్మా !
నీదు యశోరక్షణ కొరకే నిలిచినాము మేమమ్మా ! ||నిలిచి||
జ్ఞాన వర్షిణీ ! విశ్వ మార్గ దర్శినీ ! ||జయము||
ఓ మాతృభూమి ! నీకై మాదు ప్రాణాల ధారపోస్తాం
ఏ వైపు నుండి నీపై శత్రువుల కాలు మోపనీయం
ఎట్టి దుష్ట శక్తులకైన ఎదురు నిలువగల మమ్మా ! ||ఎదురు||
శౌర్యావనీ ! ధైర్య స్థైర్య నిలయినీ ! ||జయము||
ఏ జన్మ పుణ్యఫలమో ! లేక ఎన్నేళ్ళ తపః ఫలమో !
పుట్టి నీ కనక గర్భమందు పునీతుల మైతిమి మేమమ్మా !
మళ్ళి మళ్ళి నీ కడుపుననే మేము పుట్టి పెరుగనీ ||మేము||
నీ సేవలో జీవిత మర్పించనీ ! ||జయము||

-0-

# నిదురలేవరా! నిజము గానరా! ఓ మానవుడా!

-అర్షకవి ప్రణవకుమార్

నిదుర లేవరా! నిజము గానరా! ఓ మానవుడా!
మంచి చెడును యోచించి మనిషివై జీవించుమురా! ॥నిదుర॥
నరజన్మ మెంతో విలువైనదిరా ! ఆ....
ఇది మరల మరల రానిది వినరా! ఓ.....
వచ్చినా నరుడు జ్ఞానుడగుట
ఇలలోన నూటి కొక్కడురా !
జ్ఞానము మోక్షమునకు హేతువురా ! ఆ....
అది వైరాగ్యముచే దొరుకునురా! ఓ....
దొరికినా ప్రభుని పొందువాడు
ధరలోన కోటి కొక్కడురా ! అందుకే ఓ మానవుడా ! ॥మంచి॥
ఎన్నాళ్ళు బ్రతికినా కొన్నాళ్ళే ! ఆ.....
ఇవి కొన్ని దినములా కోరికలే ! ఓ.....
ఎన్ని సిరులు ఎన్నెన్ని సంపదలు
ఉన్న అన్ని శూన్యములే !
నీ నమ్ముకున్న దైవము ఒకదే
నీ జన్మ జన్మలకు తోడగులే !
నీకు నిజమునకు సిరులు సంపదలు
ప్రాకటముగ సుగుణములే! అందుకే ఓ మానవుడా ! ॥మంచి॥
పాపానికి ఫలితము తప్పదురా ! ఆ.....
తీర్థాలు తిరిగినా వ్యర్థమురా ! ఓ....
నీవు చేసికొను కర్మ ఫలితమును
నీవె అనుభవింతువురా !
నీ గర్వమె నిను చెడిపేయునురా !
నీవు త్రవ్వుకొనునట్టి గోతిలో
నీవె పడుట ఖాయమురా ! అందుకే ఓ మానవుడా ! ॥మంచి॥
దేవుడు నీ దాపుననే ఉండీ ఆ....
నీ నడక లన్ని పసిగడుతుండే! ఓ.....
నీడలాగ నీ వెంట నడచి నీ
చేష్టలన్ని చూస్తుండే !
మృత్యువు నీకై మాటున దాగీ
నిత్యము నిను కనిపెడుతునుండే !
పిల్లి ఎలుకకై పొంచి నటుల
నీ కొఱకు కాచుకొని ఉండే! అందుకే ఓ మానవుడా! ॥మంచి॥

-0-

ఓం గిరయస్తే పర్వతా హిమవన్తోఽరణ్యం తే పృథివి స్యోనమస్తు ।
బభ్రుం కృష్ణాం రోహిణీం విశ్వరూపాం ధ్రువాం భూమిం
పృథివీమిన్ద్రగుప్తామ్ । అజీతోఽహతో
అక్షతోఽధ్యష్ఠాం పృథివీమహమ్ ॥11॥

అథర్వవేదం. 12. 1. 11

ఉన్నతమైన గిరులతో, హిమవత్ పర్వతాలతో, పెద్ద పెద్ద అరణ్యాలతో కూడిన మా భూమాతను మేము శత్రురహితముగా చేయుదుము గాక ! దుష్టులకు అవాసములు కాకుండా చేయుదుము గాక! వ్యవసాయ భూములు, ఉపవనాలు మాకు వలయు పంటలను, మూలికలను, ఉపయుక్తములగు పండ్లను, కాయలను ఇచ్చును గాక! అట్టి మా మృతభూమిని మేము సదా రక్షించుకొందుము గాక !

మేము శత్రువులచే పరాజితులము కాకుందుముగాక! క్షతగాత్రులము కాకుందుముగాక! సదా మేము అధిష్టాతలముగా, చక్రవర్తులముగా, స్వాములముగా ఉందుము గాక!

*Published by:*

**Gayatri Ashram Trust**

12-10-586/6, Arya Samajam, Medi Bavi,
Seetaphalmandi (P.O.), Secunderabad - 500 061.

**Secretary - K.P. Narsing Rao, Cell: 9848011073.**